# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక


శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com





Volume 28 Issue 11

No.of Pages 40

JULY 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్సు A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:

మేనేజరు

సమర్థసద్గురు మాగజైన్

శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,


**ఈ సంచికలో....** **పేజీ**

# భద్రవాక్యం

**హగ్ం స శ్శుచిషద్వసు రంతరిక్ష సద్ధోతా**
**వేదిష దతిధిర్దురోణసత్।**
**నృషద్వరసదృత సద్వ్యోమసదబ్జా**
**గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥** - కఠోపనిషత్

ఇది కఠోపనిషత్ ద్వితీయోZ ధ్యాయమునందలి పంచమ వల్లిలోని రెండవ మంత్రము. దీనిముందరి మంత్రములో ఆత్మ పదునొకండు ద్వారములు గల పురములో నుండునని పురము ఏకవచనములో చెప్పబడినందున ఆత్మ కేవలము ఒక్క శరీరమునకు పరిమితమై ఉండునేమో అను శంకను నివారించుటకును, ఆత్మతత్త్వము సర్వవ్యాపకమని నిర్ద్వంద్వముగా తెలుపుటకును ఈ మంత్రము చెప్పబడుచున్నది.

**అసౌ వా ఆదిత్యః హగ్ం స శ్శుచిషత్** అను మంత్రములో ఆదిత్య భగవానుడే వర్ణింపబడినాడు అని బ్రాహ్మణము చెప్పుచున్నది. అయినను **సూర్య ఆత్మా** అను మంత్రమును అనుసరించి సూర్యుని పరబ్రహ్మముగను, స్థావర జంగమాత్మకమైన ఈ సర్వ జగత్తుకు సాక్షీభూతమైన బ్రహ్మమని అందరూ అంగీకరింతురు గనుక ఆ విధముగ చూచినను ఈ సకల జగత్తునకు సూర్యుడొక్కడే ఆత్మ అనియు, తదనుసారముగా ఆత్మ ఒక్కటే అనియు సిద్ధించుచున్నది. అందువలననే శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు కూడ తమ చంద్రికలో ఈ మంత్రమునకు తాము చేసిన వ్యాఖ్యానమునకు బ్రాహ్మణ వ్యాఖ్యానముతో విరోధము లేదు అనియు, ఏ విధముగా చూచినను ఆత్మ ఏకము, అద్వయము, భేదరహితము అని సెలవిచ్చి యున్నారు.

ఆదిత్యరూపుడై ద్యులోకములో హంస లేదా బ్రహ్మమే సంచరించు చున్నాడు. వసురూపుడై అంతరిక్షమునందు (వాయురూపమున ఆకాశములో) సంచరించుచున్నది కూడ హంస స్వరూపమైన ఆ బ్రహ్మమే. అగ్ని రూపమున యజ్ఞవేదికవంటి పృథ్వియందున్నది, అతిథి లేదా సోమరస రూపములో సోమపాత్రయందు, మనుష్యులలో, దేవతలలో, యజ్ఞమునందు, సత్యమునందు, ఋతమునందు ఉండునదీ ఈ బ్రహ్మమే. ఆకాశమునందు ఖేచరుల రూపములో, నీటియందు శంఖము మొదలగువాని రూపమునందు, పృథ్వియందు వ్రీహి, యవాదుల రూపములో పర్వతములపై నదులరూపములో, యజ్ఞమునందు యజ్ఞహోతగా, పురుషునిగా ఉండునది సద్రూపుడు, సర్వవ్యాపకుడు, బృహద్రూపుడూ అయిన ఈ హంస స్వరూప బ్రహ్మమే అని ఈ మంత్రమునకు అర్థము. *

# అమ్మ ఆశీస్సులు

శ్రీసద్గురుదేవుల దివ్య అనుగ్రహముతో శ్రీసద్గురు నారాయణ షడ్ధామ యాత్రను సంతోషముతో అందరు భక్తులతో అనుకొన్న విధముగానే జూన్ 12వ తారీకుతో పూర్తి చేసికొన్నాము. శ్రీగురుదేవులు తమ బోధామృతంలో చెపుతూ ఉండేవారు, " సాధు సంభాషణం సర్వ తీర్థ పుణ్యం'' అని. సాధు మహాత్ములైన శ్రీసద్గురుదేవులు ఇంతకు ముందు ఈ యాత్రలన్నిటినీ దర్శింపచేసినప్పుడు, వారి ముఖస్థుగా ప్రవహించిన ఎన్నెన్నో అమృతఝురులను భక్తులందరితోకూడి స్మరించుకుంటూ ఆ యా ప్రదేశములను దర్శిస్తూ శ్రీ గంగమ్మతల్లిని ముచ్చటగా మందాకినీ, సురనదీ, జాహ్నవీ, అలక్‌నందా, త్రిపథగా, భాగీరథీ అని తలచుకుంటూ, పది పాయలుగా ప్రవహిస్తూ ఉన్న ఆ తల్లిలో హరిద్వార్, ఋషీకేశ్, గంగోత్రిలలో స్నానములు చేయటం జరిగింది. ఇక శ్రీ కేదారేశ్వరస్వామి వారిని, శ్రీ బదరీ విశాల్‌ను దర్శించుకొని, అభిషేకించుకొని, ఆనందంగా అక్కడ శ్రీ సద్గురు నారాయణ యాగము, రుద్ర చండీ యాగములొనరించి ఉత్తరకాశీలో శ్రీ కాశీ విశ్వేశ్వరుని దర్శనము, యమునోత్రి దర్శనముచేసి, స్నానము చేసి, శ్రీసద్గురుదేవుని కృపతో వైష్ణవీ దేవిని, అమృతసర్‌లో శ్రీ గురుగ్రంథ్ సాహెబ్ ను దర్శించి ఈ శ్రీ సద్గురునారాయణ షడ్ధామ యాత్రను పూర్తి చేసికొన్నాము.

ఎక్కడ చూసినా, ఎక్కడ వెతికినా ఉన్నది ఒక్కటే - భక్తుడైనవాడు నమ్ముకొన్న పాదము. శ్రీ మహావిష్ణువు పాదమునుండి ఉద్భవించిన గంగ "శ్రీ విష్ణు పాదోద్భవీ గంగా'' శ్రీ మహాదేవుని శిరస్సునలంకరించినదై, శ్రీ భగీరథుని తపోమహిమతో మనందరిని, ఈ భూమిపైనున్నవారందరిని తరింపచేస్తున్నది ఆ తల్లి,

ఇవి అన్నియు గుర్తించుటకు కారణం, అనుభవించుటకు కారణం, శ్రీసాధుమహాత్ములైన శ్రీ సద్గురుదేవుల శుభాశీస్సుల మాహాత్మ్యమే. అట్టి శ్రీ సద్గురు దేవుల ఆశీస్సులను మనమందరము పొందుదుము గాక!

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీ వైష్ణోదేవీ, అమృత్‌సర్ స్వర్ణదేవాలయం, గంగోత్రి, యమునోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్ క్షేత్రాలలో క్షేత్రజ్ఞ దర్శనం చేసుకొని శ్రీగురు షడ్ధామ యాత్ర నిర్విఘ్నంగా పూర్తిచేసుకొని యాత్రిక భక్త బృదం జూన్ నెల 11వ తేదీ అర్ధరాత్రి పన్నెండున్నర ఒంటిగంటల మధ్య ఆశ్రమానికి చేరుకున్నారు. షుమారు 140మంది భక్తులు పాల్గొన్న ఈ యాత్రలో 60సం॥లు 70సం॥లు దాటిన భక్తులు ఎంతోమంది ఉండటం విశేషం. యాత్ర మధ్యలో ఉత్తర భారతంలో ఉద్రిక్త పరిస్థితులు నెలకొని అల్లర్లు జరిగినా భక్త బృందానికి ఏ ఇబ్బందీ కలగకుండా క్షేమంగా యాత్రలు పూర్తి చేయించటం గురుకృపా విశేషమే. యాత్రలు చేసివచ్చిన భక్తులందరూ విరామంలేకుండానే 12వ తేదీ తెల్లవారుజాముననే మహన్యాసపూర్వక రుద్రాభిషేకం చేసుకున్నారు. వెంటనే యాగం ప్రారంభం అయింది. హోమమూ, పూర్ణాహుతి అయిన వెంటనే సద్గురు పాదపూజ కార్యక్రమం జరిగింది. యాత్రనుండి తిరిగివచ్చిన భక్తులకు సత్సంగలాభం కలిగించాలనే దృష్టితో జూన్ 12,13,14 తేదీలకు మార్చిన జూన్ సత్సంగ కార్యక్రమంలో సమయాభావం వలన ఆరోజు శ్రీమాతాజీ గురుపూజ అనంతరం కొద్దిసేపు మాత్రం తమ అనుగ్రహ భాషణాన్ని అందించారు.

13వ తారీకు ఉదయం శ్రీ విజేశ్వరానంద ప్రసాద్‌గారి అధ్యక్షతలో జరిగిన సత్సంగ సభలో శ్రీ రమణప్రసాద్ సభాప్రారంభం చేశారు. అధ్యక్షోపన్యాసం తరువాత శ్రీ మనోజ్‌కుమార్ అనంత గురుతత్త్వాన్ని గురించి మాట్లాడారు. శ్రీ జానకిరామశాస్త్రి, శ్రీ కుమారస్వామి రాజా ఆధ్యాత్మిక ప్రసంగాలతో ఉదయం సభ ముగిసింది. సాయంత్రం డా॥వెంకటరమణ ప్రసాద్ ప్రవచనం అనంతరం శ్రీ కామేశ్వరీ ప్రసాద రాధాకృష్ణ తత్త్వంపై మాట్లాడారు. అనంతరం శ్రీమాతాజీ అనుగ్రహ భాషణం. (దీని సంగ్రహ రూపాన్ని మాతాజీ బోధామృతంలో చూడవచ్చు). 14వ తేదీ శ్రీ రమణ ప్రసాద్, శ్రీ రామతారక పరబ్రహ్మ పసాద్, శ్రీ మనోజ్ కుమార్, శ్రీ శివ ప్రసాద్ ప్రవచనాలతో జూన్ సత్సంగ కార్యక్రమాలు ముగిశాయి.

జులై 7వ తారీకు వ్యాస పూర్ణిమ. గురు సంప్రదాయంలోనివారు గురుస్థానంలో ఉండాలని కోరుకునే రోజు. జులై నెల సత్సంగాలు 29,30,31 తేదీలలో జరుగుతాయి. అందరూ ఆహ్వానితులే. - గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

మానవుడికి ముఖ్యంగా కావలసింది ప్రార్థన. ప్రార్థన చక్కగా జరగాలంటే మనస్సుకు attachment,detachment రెండూ కావాలి.

విషయాదులనుండి మనస్సును detach చెయ్యాలి. అంటే విడదీయాలి. ఎక్కడ ఉంచాలి? మనస్సు చాలా చంచలమైనది. పాదరసం కంటే చంచలము. కుక్కతోకకంటె వంకర. దానిని అదుపులో ఉంచాలంటే భగవంతుని పాదారవిందములకు attach చెయ్యాలి. అందుకే నారదాదులు నారాయణ స్మరణమును క్షణమైనా వీడలేదు.



"నేను పూర్ణజ్ఞానిని;అధికారిని; సర్వము తెలిసినవాడను"అనుకున్న మానవునికి ఏమీ తెలియనట్లే అని శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారన్నారు. ఎంత పెద్ద dam అయినాచిన్న బెజ్జము ఉంటే పగిలిపోతుంది. కనుకనే సర్వ కర్మ బీజాలూ హరించాలి.

అహంకారం చాలా చెడ్డది. దానినుండి కామక్రోధాదులు ఉత్పన్నమవుతాయి. అవి మానవుని పతనం చేస్తాయి. మనో, బుద్ధి, చిత్త, అహంకారములలో అహంకారము నాల్గవది. మనస్సు ఇంకా చెడ్డది. దాని వేగంలెక్కకు అందనిది. అటువంటి మనస్సును అదుపులో ఉంచగలవారు ఎవరు? ఎలా ఉండాలి?

ఇనుమును ఆకర్షించి పట్టి ఉంచగలిగినది అయస్కాంతము. అలాగే చరాచర జగత్తులోని అన్ని లోకాలను ఒకశక్తి అదుపులో పెట్టి సత్యము, నియమము తప్పకుండ నడుపుతున్నది. భూలోకము, నక్షత్ర మండలాలు, ఇతర లోకాలు, అన్నీ ఒకదానికి ఒకటి సంబధము లేనివి. ఇవన్నీ అతి వేగంతో ఆకాశంలో పరిభ్రమిస్తున్నాయి.( అయితే గగనం శూన్యం అన్నారు. కనుకనే జగత్తు శూన్యమని, యద్దృశ్యం తన్నశ్యమని అన్నారు.) అన్నిటిలోనునిండి ఉండి వీటికి ఆధారభూతమై దేనికీ అంటక అన్నిటికి సాక్షిగా, సగుణ, నిర్గుణ రహితమైన వస్తువొకటి ఉంది. అదే పరమాత్మ వస్తువు.

అదే ప్రణవము. 'ఓం' అనే ప్రణవములోనే, సమస్త దేవతలు, సర్వ లోకాలు ఉన్నాయి. దానిని ఉపాసించిన వారు ధన్యులు. పురుషపరంగాప్రణవమే నారాయణుడు, స్త్రీ పరంగా ప్రణవమే అనంతశక్తి. ఈ ప్రణవమే అనంతనామాలతో అనంత రూపాలతో వ్యవహరింపబడుతున్నది.

మనస్సు శరీరమంతటా ఎలా వ్యాప్తమై ఉందో, పరమాత్మ వస్తువు అలాగే సర్వత్రా వ్యాప్తమై ఉంది. అది అనంతము. మానవుని తరింపజేసే శక్తి కలది. దానిని తెలుసుకొని తనకు తానై ప్రకాశించినవాడే ధన్యుడు.

'ఓం' పరమాత్మబీజము. అది అనంతశక్తి. ప్రజ్ఞాన పరబ్రహ్మ స్వరూపము. వేదమాత. వేదాతీతము. ఈశ్వర స్వరూపము. సర్వలోకాలను, నక్షత్రమండలాలను, సమస్త సృష్టిని నియమం తప్పకండా నడిపేది ప్రణవమే'

ఒక్క భూమండలాన్ని గురించిన విశేషాలేకాక ఇతరలోకాల మండలాల విశేషాలన్నీ మన శాస్త్రాలలో ఉన్నాయి. మన దేశము అంత గొప్పది. అట్టి దేశంలో పుట్టికూడాయాధ్యాత్మిక దృష్టి లేనివాడు వ్యర్థుడు.ఈ అనంత విశ్వంలో ప్రతిరోజూ ప్రళయం జరుగుతూనే ఉన్నది. సృష్టి , స్థితి, లయము ఈ మూడూ అనుక్షణమూనిరంతరాయంగా జరుగుతూనే ఉన్నాయి. ఈ లోకాలను, లోకస్థులను, లోకేశులను దాటి మహాకాశమనే పెంజీకటి వద్దకు వెళ్ళాలంటేనే, సెకండుకు మూడు లక్షల కిలోమీటర్ల వేగం కల కాంతి వేగంతో మానవుడు 58 లక్షల సంవత్సరాలు ప్రయాణించాలి. దాన్ని దాటితేగాని ప్రణవస్వరూపమైన పరంజ్యోతిని దర్శించలేము. పవిత్ర భాగవతాన్ని రచించిన పోతన మహాత్ముడు ఆ పరంజ్యోతిని సేవించుకుని ధన్యుడైనాడు. మన భారతీయులందరు తమ తపశ్శక్తితో ఆ పరంజ్యోతిని దర్శించినవారే. అటువంటి ఆధ్యాత్మిక సంపదకు మనం అందరమూ వారసులమే. ఆ సంపదనంతటిని ప్రతి ఒక్కరూతమ స్వంతం చేసుకుని అనుభవించి అంతులేని ఆత్మానందంలో ఓలలాడవచ్చు. కాని అలా అనుభవించాలంటే ఆ మహర్షులవలెమనమూ ఎంతో ఓర్పుతో, పట్టుదలతో, అనన్య చింతనతో కృషి చేయాలి. అత్యల్పమైన తన ఆయుర్దాయంలోని అనుక్షణమును మానవుడు సాధనతో సద్వినియోగం చేసుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

సాధకుడైనవాడు ఏనాడూ ఇతరులని విమర్శించకూడదు. తనలో వుండే తప్పులను తాను తెలిసికొని, వాటిని సరిదిద్దుకుంటూ, ఎప్పటికప్పుడు ఆత్మవిమర్శ చేసుకోవాలి. పిల్లవాయువులలా కలవర పెట్టే విషయాదులని మనస్సులో నుంచి బయటకు పారద్రోలాలంటే అది భగవన్నామమనే ఝంఝూమారుతానికి (సుడిగాలికి) మాత్రమే సాధ్యం. కనుక అనుక్షణము, ఏపని చేస్తున్నా శ్వాసద్వారా భగవన్నామం చేసుకుంటూ వుంటే మాయకి ఇక తావేది? మారుతి ఒక్కసారి 'రాం' అనేసరికల్లా ఆయన దేహం మీద ఉన్న 33 కోట్ల రోమాలు కూడా 'రాం! రాం! రాం!' అని ప్రతిధ్వనించేవి అని గురుమహరాజ్ చెప్పేవారు. అలా తైలధారగా నామం జరుగుతూ ఉంటే ఇక ఇతరమైన ఆలోచనలు రావడానికి ఖాళీ ఎక్కడ ఉంటుంది?



మహాత్ముల బోధని మాటిమాటికీ వినాలి. విన్నది నిరంతరం మననం చేసికోవాలి. దానిని ఆచరణలో పెట్టాలి. ధ్యానం చేసుకొనేటప్పుడు మనసు నిలబడటం లేదు అనుకున్నప్పుడు, విన్న గురుబోధని జ్ఞప్తికి తెచ్చుకుంటే చాలు. అదే మననమయి, నిదిధ్యాసలోకి తీసుకువెళ్తుంది. గురుబోధని ఎప్పటిదాకా వినాలి అంటే, మనసుకి పట్టేదాకా వినాలి. వినగా వినగా మనసు పరిశుభ్రం అవుతుంది.

మనస్సు అనేది చాలా గొప్పదని ఇందాకటినుంచీ చెప్పుకుంటూనే ఉన్నాం. దానిని మన ఆధీనంలోకి తెచ్చుకోవాలంటే అది మనవల్ల అయ్యే పనికాదు. కనుక ఆ మనస్సుని ప్రకాశింపచేస్తున్న పరమాత్మని (గురుదేవుని) మనం శరణుకోరితే వారు ప్రసాదించిన మహామంత్రధ్యానం వలన మన మనస్సుని లొంగదీసుకోవచ్చు.

పుట్టిన ప్రతిజీవికి మరణం అనివార్యం. కనుక మృత్యువు మనని

కబళించేలోగానే జగత్తు యొక్క అనిత్యత్వాన్నీ, భగవంతుని యొక్క సత్యత్వాన్నీ, నిత్యత్వాన్నీ గురించి చక్కగా విచారణ చేసికోవాలి. 'నేను తరించి తీరుతాను' అని ఎవరికి వారే గట్టి నిర్ణయం తీసుకొని దీక్షగా సాధన చేయాలి. ఎంత పరస్పర అనురాగం కలిగిన భార్యాభర్తలైనా ఎవరి అన్నం వారు తింటేనే వారి కడుపు నిండుతుంది. అంతేకాని ఇంకొకరు తింటే మన కడుపు నిండదుకదా. కనుక శాశ్వతమైన సత్యవస్తువుని తెలిసికొని ఆనందాన్ని పొంది తరించాలి అని అనుకునే సాధకులు ఎవరి సాధన వారేచేయాలి. సాధన చేసిన కొద్దీ జిజ్ఞాస పెరుగుతుంది. గురుదేవులు చెప్పినదాన్ని ఆచరిస్తేనే ఆనందం దొరుకుతుంది. అది మార్పులేనటువంటి ఆనందం. దానిని సాధించడమే మానవ జన్మ కలిగినందుకు సార్థకత. అదే తరించడమంటే.

ఒక్కొక్కసారి మనకి తెలియకుండానే మనకి దెబ్బలు తగలడమో లేక శరీరంపై గీట్లు పడటమో జరుగుతూ ఉంటాయి. అది తగిలినప్పుడు మనకి తెలియదు. కానీ ఆ తరువాత అక్కడ నల్లగా కమిలితేనో, వాపు, నొప్పి చేస్తేనో, గీట్లు దద్దుర్లు కనిపిస్తేనో 'అయ్యో! ఇదెలా జరిగింది? నాకు తెలియనే లేదే!' అనుకుంటూ ఉంటాం. అది జరిగినప్పుడు మనకెందుకు తెలియలేదు? మనస్సు దాని మీదలేదు కనుక, జరిగింది మనకి తెలియలేదు. అదే విధంగా డాక్టర్లు ఆపరేషన్ చేసేటప్పుడు మత్తునిస్తారు. మత్తుమందు ఇచ్చి మనస్సుని శరీరం నుండి వేరుచేస్తున్నారు. అప్పుడా శరీరాన్ని కోసినా మనకి తెలియదు. ఆ సమయంలో మనస్సు నిద్రపోతోంది కనుక దానికి, శరీరానికి కనెక్షన్ విడిపోతున్నది. వీటివలన మనకి తెలుస్తున్నదేమిటంటే శరీరం నుండి మనస్సుని వేరుచేస్తే మనకి నొప్పిగాని, బాధగాని తెలియటం లేదన్నమాట ఈ స్థితిని మనం ఏ బాహ్యమైన మత్తు మందులు లేకుండా, జాగ్రత్తలో ఉండగానే మనస్సుని గురులక్ష్యార్థంపై నిలపటం ద్వారా సాధించవచ్చునని మహాత్ములు చెబుతున్నారు. చెప్పడమే కాదు వారు ప్రత్యక్షంగా ఋజువు చేశారు కూడాను. ఒక నవాబు శ్రీసదాశివ బ్రహ్మేంద్రులవారి రెండు చేతులూ నరికివేసినా స్వామివారు హాయిగా పాటుకుంటూ వెళ్ళిపోతూనే ఉన్నారని మనం అనేకసార్లు చెప్పుకున్నాం. ఇవి పుక్కిటి పురాణాలు కావు. యథార్థంగా జరిగిన చరిత్రలు.

- సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

"మనందరరిని మాయలో పడవేయటానికి అంతేనా?" అన్నారు శ్రీబాబు.

అసలు విషయానికి వద్దాము. సృష్టిలో శక్తిహీనమైనది లేదు. భూమిలో ఎంతోకాలంగా పాతిపెట్టబడిన శల్యము కూడా శక్తిని కలిగిఉంటుంది. దానికి ఇప్పుడే ఒక దృష్టాంతం చెబుతాను. శకుని చరిత్ర మీకు తెలిసిందే కదా! తన తండ్రి శల్యములను పాచికలుగా చేసికొని పాండవులను మోసగించి, కురుపాండవ యుద్ధానికి కారణభూతుడై, కౌరవ నాశనానికి కారకుడైనాడు. ఈ విషయం కృష్ణపరమాత్మకు మినహా ఎవరికీ తెలియదు అన్నారు. అసలు శకుని ఎవరు? అతనికి కౌరవులపై ఆగ్రహం కలగటానికి కారణం ఏమిటి? అనే విషయాన్ని తెలిసికొంటే మీరంతా ఆశ్చర్యపోతారు.

గాంధారికి నూరుగురు సోదరులు. అందులో శకుని ఒకరు. ఏదో ఒక సందర్భంలో దుర్యోధనుడు భీముణ్ణి కుండకుడు అని దూషిస్తాడు. భీముడు ఆ పదము యొక్క అర్థాన్ని కృష్ణపరమాత్మ ద్వారా తెలిసికొంటాడు. వెంటనే వ్యథ చెందుతాడు. భీముని బాధను తెలిసికొన్న కృష్ణపరమాత్ముడు దుర్యోధనుని జన్మ వృత్తాంతాన్ని తెలియజేస్తాడు. ఒక పర్యాయము భీముడు దుర్యోధనునితో సంభాషణ చేస్తుండగా దుర్యోధనుని గోళకుడు అని సంబోధిస్తాడు. దుర్యోధనుడు ఆ పదము యొక్క అర్థాన్ని తన తల్లిని అడిగి తెలిసికొంటాడు. గాంధారి తన వృత్తాంతాన్ని దుర్యోధనునికి తెలియ జేస్తుంది. గాంధారికి వైధవ్య ప్రాప్తి ఉందని తెలిసి, మొదట ఆమెకు ఒక మేకతో వివాహం చేస్తారు. వెంటనే ఆ మేక మరణిస్తుంది. అటుపిమ్మట ధృతరాష్ట్రునితో వివాహం జరుగుతుంది.

ఆ విషయం తెలిసిన దుర్యోధనుడు గాంధారి అన్నదమ్ములు వందమందిని భూగృహంలో బంధించి వారికి తినటానికి రోజుకు నూరు గింజలు మాత్రము అందిస్తాడు. అన్నదమ్ములంతా యుక్తిని పన్ని ఆ నూరు గింజలు శకుని మాత్రమే భుజిస్తాడు. తండ్రి అన్నదమ్ములు అంతా మరణిస్తారు. అలా బ్రతికి బయటపడ్డ శకుని కౌరవులపై కక్షగట్టి యుక్తిచేత

శాంతికాముకులైన పాండవులను రెచ్చగొట్టి కురువంశ నాశనానికి కారకుడైనాడు. దీనికంతటికి తోడ్పడింది ఏమిటో తెలుసా? శకుని తండ్రి యొక్క శల్యములు.

కాబట్టి ఆత్మశక్తి సర్వవ్యాపకము. పరమాత్ముడు ఎవరిని ఎలా కరుణిస్తాడో మనము ఏమి చెప్పగలము? మీకు ఒక దృష్టాంతం చెబుతాను. మాణిక్యంగారని ఒకరుండేవారు. ఆయన మంచి భక్తుడు. కాబట్టి ఆధ్యాతిక శక్తి ఆయనకు చేయూతనిచ్చి వృద్ధిలోకి తీసికొని వచ్చింది. ఎంతో కష్టపడి ధనాన్ని ఆర్జించారు. కాని వారి సంతానంలో ఏ ఒక్కరికి అంత భక్తి ప్రపత్తులు లేవు. మరి తండ్రి ఆర్జించిన ఆ ధనాన్ని వారికి సంక్రమింపచేసినప్పటికి దానిని వారు నిలబెట్టుకోవాలి అంటే పరమాత్మశక్తి తోడ్పడాలి కదా. అటువంటి ప్రయత్నం వారు చేయకపోతే భగవంతుణ్ణి నిందించి ఏంలాభం?

**27-2-1985**

ఈరోజు ఉదయం శ్రీబాబు భక్తులనుద్దేశించి మాట్లాడుతూ 'పూర్వకాలంలో గురువు ఆదేశించినట్లుగా శిష్యులు నడుచుకునేవారు. కాని ఇప్పటి పరిస్థితి నేరు. శిష్యులకు అనుగుణంగా గురువులు నడుచుకోవాలి. మీకొక సంఘటన చెబుతాను. ఆశ్రమవాసం చేద్దామని ఆశించి ఒక శిష్యుడు ఆశ్రమ జీవిత విధానం ఎలా ఉంటుందో తెలిసికొందామని ఒక గురువుని ఆశ్రయించాడు. ఆశ్రమవాసం గురించి, వాటి నిబంధనలను గురుదేవుడు చెప్పటం మొదలు పెట్టేసరికి ఆ శిష్యుడు భయపడిపోయాడు. ఆ శిష్యుడి బుర్రకి ఒక ఆలోచన కలిగింది. వెంటనే గురువుగారిని మీరు చేసే పనులు ఏమిటో సెలవివ్వండి అని ప్రశ్నించి, తాను శిష్యుడు కన్న గురువుగానే ఉందామని నిర్ణయించుకుంటాడు. చూశారా ఈనాటి శిష్యులు ఎలా ఉంటారో!

గురువు అంటే ఎవరు? ఆయనకి ఏ విద్యార్హతలు అవసరం లేదు. కాని అన్ని విద్యలకు మించిన బ్రహ్మవిద్యకు అధిపతి. అటువంటి వారే గురునానక్, కన్నప్ప, నందనారు మొదలైనవారు. సమర్థ సద్గురువుకు, భగవానుడికి తేడా లేదు. ఆశ్రయిస్తే గీతాచార్యుని వంటి గురువుని ఆశ్రయించాలి. మానవులు గురువు యొక్క శక్తిని గ్రహించ గలుగుతారా? గురుతత్వాన్ని అర్థం చేసుకోగలుగుతారా? కృష్ణపరమాత్మ స్వయంగా తన గురించి చెప్పినా ఎంతమంది అర్థం చేసుకున్నారు? అర్థం చేసుకున్నవారు ధన్యులయ్యారు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**జూలై 2009**

| | | |
|---|---|---|
| 2 | గురు | తొలిఏకాదశి, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన. |
| 7 | మంగ | ఆషాఢ వ్యాస పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన. (చాతుర్మాస్య దీక్ష ప్రారంభం) |
| 17 | శుక్ర | శ్రీగురుదశమి, సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ. |
| 20 | సోమ | మాసశివరాత్రి. |
| 22 | బుధ | సూర్యగ్రహణము |

**29,30,31 సత్సంగ సమావేశాలు**

| | | |
|---|---|---|
| 31 | శుక్ర | వరలక్ష్మి వ్రతం. |

**ఆగష్టు 2009**

| | | |
|---|---|---|
| 5 | బుధ | రాఖీ పూర్ణిమ శ్రీ సద్గురు పాదపూజ, |
| 9,10,11 | | సత్సంగ సమావేశాలు |

**13 గురువారము నుండి 15 శనివారము వరకు శ్రీ కృష్ణాష్టమి వేడుకలు**

| | | |
|---|---|---|
| 13 | గురు | ఉదయం 10 గం.లకు కలశస్థాపన,శ్రీ రాధాకృష్ణ అర్చన, భక్త సమారాధన. |
| 14 | శుక్ర | ఉదయం 10 గం.లకు శ్రీ రాధాకృష్ణ సామూహిక పూజలు,శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన. |
| 15 | శని | శ్రీ గురుదశమి, ఉదయం 11 గం.లకు శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన. |
| 18 | మంగ | మాసశివరాత్రి. |
| 23 | ఆది | శ్రీవినాయక చవితి, ఉదయం 5గం.30ని.లకు శ్రీ సద్గురు పాదపూజ. ఉదయం 11 గం.లకుశ్రీవిఘ్నేశ్వరస్వామి సామూహిక పూజలు. భక్త సమారాధన. |

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

డిశంబరు 9నుండి 11 వరకు గుండుగొలనులో జరిగిన శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞంలో 10వ తేదిన పరమహంస పరివ్రాజక పరమపూజ్య శ్రీశ్రీశ్రీ దండి నిర్మలానందగిరి స్వామీజీవారు అందించిన బోధామృత సారాంశం పాఠకులకు అందిస్తున్నాం. - ఎడిటర్

ఆనందం ఆనందం అమ్మనామమే ఆనందం
అద్వైతరూపిణి ఆనందదాయిని అమ్మనామమే ఆనందం
మోహనాశిని మోక్షప్రదాయిని అమ్మనామమే ఆనందం
అజ్ఞాననాశిని జ్ఞాన ప్రదాయిని అమ్మనామమే ఆనందం
ఆనందం ఆనందం సద్గురునామమే ఆనందం
ఆనందం ఆనందం బాబు నామమే ఆనందం

ఈ గుండుగొలను గ్రామంలో చంద్ర ఉన్నది (శ్రీమాతాజీవారి పూర్వ నామధేయం). కనుకనే స్వామి(శ్రీబాబూజీ మహరాజ్‌వారు) ఈ గ్రామాన్ని పునీతం చేశారు. శరన్నవరాత్రులలో శ్రీబాబు అమ్మవారి నవరాత్రి పూజలు చేస్తే కొబ్బరికాయల షాప్స్ వచ్చేవట. ఇది జ్ఞానకొలను. చంద్ర మాతాజీ ఇక్కడ ఉద్భవించింది. ఎక్కడైనా ఒక మహాత్ముడు ఉద్భవించాడు అంటే ఆ స్థలం పవిత్రమై ఉండాలి. గీతాజయంతినాడే నేను సన్యాసం పుచ్చుకొన్న రోజు కావటం విశేషం. భగవద్గీతకు జయంతి ఉంది. ఉపనిషత్తులకు జయంతి లేదు. రాముడు చెప్పింది రామ గీత అయింది. శివుడు చెప్పింది శివగీత అయింది. కాని ఇది భగవద్గీత. ఇది అందరికీ శిరోధార్యం.వ్యాసులవారు వెన్ను తట్టి హెచ్చరిస్తున్నారు "శ్రీ భగవానువాచ" అని. భగవద్గీతకు అలాంటి పవర్ ఉంది.

ఆయన (భగవానుడు) వేణుగానం చేశాడట. రాబోయేవాళ్ళ గీత ఏమిటి అనుకొని గీతాగానం చేశాడు. మా గురుదేవులైన శ్రీమలయాళ స్వామివారు ఏ శుభకార్యం జరిగినా ముందు గీత ప్రారంభించేవారు. నది దాటాలంటే ఈత నేర్చుకోవాలి. అలాగే సంసారం దాటాలంటే గీత నేర్చుకో! ఏ విధంగా ఆచరించాలో తెలుపుతూఅన్ని ధర్మాలు ప్రబోధిస్తుంది గీత. ధర్మానికి అతీతమైన జ్ఞానమేదైతే ఉందో దానిని పునీతం చేసికోమని చెప్పింది

గీత. నీకు నిద్ర రాకపోతే తల క్రింద గీత పెట్టుకో. నీ జేబులో భగవద్గీత పెట్టుకో. నీ పాకెట్‌లో సిగిరెట్ ప్యాకెట్ ఉంటే దానిని తెరచిచూడు. అందులో ఉన్న డేంజర్ వార్నింగ్ చూడు. దానిని అర్థం చేసికో.

వంట చేయటానికి ఒక అగ్గిపుల్ల చాలు. 70 పుల్లలు వెలిగింపనక్కర్లేదు. భగవద్గీతలో అన్ని శ్లోకాలు చదవనక్కరలేదు. ఒక్క శ్లోకం చాలు. మనకి రెండు మాయలు పట్టుకొన్నాయి - ఒకటి -టి.వి; రెండు - సెల్‌ఫోన్. భార్యనైనా వదిలి పెడతాడు కాని సెల్‌ఫోన్‌ను విడిచిపెట్టలేడు. తన జీవితాన్ని బాగుచేసుకొని గమ్యస్థానానికి చేర్చే దివ్యమైన శాస్త్రం శ్రీమద్భగవద్గీత. పూర్వార్థముఖస్థగా -

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః**
**భ.గీ 9/34**

ఉత్తరార్థముఖస్థగా -

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోzసిమే ॥**
**భ.గీ18/65**

'నా యందు మనసునుంచుము. నాయందు భక్తి కలిగి ఉండుము. నన్ను భక్తితో పూజింపుము. నాకు నమస్కరింపుము. నువ్వు నన్నే పొందెదవు. నీవు నాకు ప్రియుడవు కనుక ఇది సత్యము అని ప్రతిజ్ఞ చేయుచున్నాను'

ఈ శ్లోకంలో నాలుగు యోగాలు భగవానుడు చెప్పాడు - మన్మనాభవ (జ్ఞానయోగం) ; మద్భక్త భక్తియోగం) ; మద్యాజీమాం (కర్మయోగం); నమస్కురు (నమస్కారయోగం). అంతేకాదు. ఇలా చేస్తే నన్నే పొందుతావు, ఇది సత్యము అని ప్రతిజ్ఞ చేశాడు. కాబట్టి పైన చెప్పిన నాలుగు యోగాలలో ఏ ఒక్క మార్గాన్ని అనుసరించి సాధన చేసినా తప్పక భగవత్ప్రాప్తి లభిస్తుంది. సాధనలో పురోగమించాలంటే నీ వికారాలన్నీ తొలగించుకోవడమే. మనస్సులో కలిగే వికారాలు రెండు విధాలు: వికారాంశము -జడానికి నీకు గల సంబంధము : ప్రకాశాంశము -చైతన్యానికి నీకు గల సంబంధము.

-సశేషం

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

నామదేవ్ పరిగెత్తటంచూసి భక్తులందరూ సంకీర్తనచేస్తూ వెంటపడ్డారు. నివృత్తినాథ్‌ని చూడగానే నామదేవ్ ఆయన పాదాలమీద వాలిపోయాడు.

నివృత్తినాథుడు, జ్ఞానదేవుడు, సోపాన, ముక్తాబాయి అంతా బాల పరమేశ్వరులవలె ప్రకాశించారు. జ్ఞానతేజో కిరణాలు దిక్కులన్నింటినీ వెలుగుతో నింపాయి. తూర్పు దిక్సతి ముఖం పాండురంగడి దర్శనంకోసం ఉవ్విళ్ళూరుతూ క్రమంగా అరుణిమను పులుముకొని రాగరంజితమౌతున్నది. అందరూ కాకడారతికి గుడివైపు నడిచారు. పాండురంగడి సగుణసాకారమూర్తి అలౌకికమైన దివ్య రోచిస్సులతో వెలిగిపోతున్నది. సాక్షాత్తు పరమేశ్వరుడే బాలుర రూపంలో త్రిమూర్తులు ఆదిమాయతో సహా గుళ్ళోకి వచ్చినట్లు అనిపిస్తున్నది. అందరూ కాకడారతి పాట పాడుతున్నారు.

**యుగే అఠ్ఠావిసి వివేవరి ఉభా.......**

అందరూ ఏక కంఠంతో సగుణ విఠలుడికి హారతి ఇచ్చారు.

నామదేవుడి నామభక్తికి జ్ఞానదేవుల జ్ఞానం తోడైంది. రోజులు గడిచిన కొద్దీ అతడి సంసారలతకూడ ప్రవర్ధమానం అవుతున్నది. నారాయణ తరువాత ఆ లతకు మహదేవ, గోవింద, విఠల అనే మరో మూడు ఫలాలు వచ్చాయి. ఆ తరువాత లింబాయి అనే పుష్పం పూసింది. నామదేవుడు మాత్రం రోజురోజుకు ప్రపంచం నుండి దూరం అవుతున్నాడు. దామాశెట్టిగారి ఆదాయం నానాటికి తీసికట్టు నాగంభొట్లూ అన్న సామెతగా ఉన్నది. పాండురంగడి అనుగ్రహం వలన ఇంట్లో అందరికీ నాలుగువేళ్ళు నోట్లోకి పోతున్నాయి. నామదేవుడు ఆహారం, నీరు, నిద్ర కూడ పట్టించుకోకుండా కాలాన్నంతా సంకీర్తన, సత్సంగాలలో భగవన్నామ ప్రచారానికే గడిపేస్తున్నాడు.

కాస్తైన ఇంటి సంగతి పట్టించుకోమని జని నామదేవుడికి నచ్చచెప్ప చూసింది. 'నామా! నా మాటకూడ నీవు లెక్కచేయకపోతే ఈ ఇల్లు వదలి నాదారి నేను చూసుకుంటాను' అని బెదరించింది. 'ఒసే జనీ! నీవు ఉన్నావన్న ధైర్యంతోనే కదా నేను నిశ్చింతగా దేవుడు అప్పచెప్పిన నామ ప్రచారం చేస్తున్నాను. జని లేకపోతే నామదేవుడు ఉండడు. నేను చందనం అయితే దాని సుగంధానివి నీవు. నేను ఆకారాన్ని అయితే, దాని నీడవు నీవు. మా

ఇంటిల్లిపాదికి తల్లివి. అమ్మవే జనీ! నీ స్థానం అది. నేను ఆర్తిగా విఠలా అని పిలిస్తే ఆ పిలుపు చేరేది నీకే. నీ రూపంలో విఠలుడు నాకు విఠాయి(అమ్మ) అవుతాడు. నీవు వెళ్ళిపోతానంటే ఎలా?' నామదేవుడి ఏకనిష్ఠ భక్తికి జని హృదయం ద్రవించిపోయేది. విఠలుడి సంకీర్తనలో నామదేవుడితోపాటు ఇంట్లోవాళ్ళు కూడ ఆకలిదప్పులు మరచిపోతున్నారు.

నామదేవుడు చంద్రభాగ ఇసుకతిన్నెలలో సంకీర్తలో మైమరచి ఉన్నాడు. అతని శ్రవణేంద్రియంలోకి దూరంనుంచి మందమందంగా, మధురంగా సన్నగా పిల్లనగ్రోవిపాట ప్రవేశించింది. కళ్ళు తెరచిచూస్తే ఎదురుగా వాసుదేవ్. అతడు జ్ఞానదేవులతో పైఠణ్ వెళ్ళి తిరిగివచ్చాడు. పైఠణ్లోని విద్వాంసులు విద్వత్ సభ ఏర్పాటు చేశారు. జ్ఞానదేవులను పైఠణ్ విద్వాంసులు పరీక్షించటం, జ్ఞానదేవులు దున్నపోతులో సైతం హరి ఉన్నాడు అని నిరూపించటానికి తన హస్తాన్ని దాని మస్తకంపైన ఉంచగానే అది సుస్వరంతో వేదం వల్లెవేయటం, పరీక్షించటానికి ప్రయత్నించిన విప్రులు సిగ్గుతో తలలు వాల్చుకోవటం కొందరు తమ పాండిత్యానికి ధిక్కారం చేసి, వారి పాదా క్రాంతులు కావటం, చాంగదేవుడనే హఠ యోగి వారిని కలవటానికి వ్యాఘ్రంపైన ఆకాశ మార్గాన వస్తే, ఎండకాచుకుంటున్న ఆ అన్నదమ్ములు తాము కూర్చున్న నిర్జీవమైన ఆ మొండి గోడనే ఆకాశమార్గంలో నడిపిస్తూ ఆయనకు స్వాగతం పలకటం, చాంగదేవుడు వినమ్రంగా పశ్చాత్తాపాశ్రువులతో పాదాభిషేకం చేసి జ్ఞానభిక్ష వేడుకోవటం మొదలైనవన్నీ వివరంగా చెప్పాడు.

వింటుండగానే నామదేవుడి ఒళ్ళు జలదరించింది. రోమాంచం అయింది. తనువంతా పులకించి పోయింది. 'ఒరేయ్! కపటీ! మోసగాడా! వాసుదేవ్గా నాకు పరిచయమై జ్ఞానదేవుడితో పైఠణ్ వెళ్ళి అక్కడ ఈ లీలలన్నీ చేసింది నీవే. విఠలా! నీవే దున్నపోతుతో వేదం పలికించింది. నీవే మొండిగోడను ఆకాశంలో నడిపించింది. అయినా నీ ఉనికిని గుర్తించలేకుండా చేసి, వాసన అయినా తగలనీయకుండా నన్ను వెర్రిబాగులవాడిని చేశావు' నామదేవ్ ఆక్రోశించాడు. నామ వాసుదేవ్ను పట్టుకోబోయేటంతలో పెద్ద గాలిదుమారం లేచింది. అర్ధక్షణంపాటు వేణుగానం వినిపిస్తూ దూరం అవుతూ అనంతంలో లీనమైంది. వాసుదేవ్ అంతర్ధానమైనాడు.

నామదేవ్ జ్ఞానదేవుడి గురించి అందరికీ చెప్తూ భక్తి ప్రచారంలో పూర్తిగా మునిగిపోయాడు. ఇంట్లో బియ్యపుగింజలేదు. కట్టుకోవటానికి బట్టలులేవు.

పిల్లలు పెళ్ళీడుకు వచ్చారు అన్న ధ్యాసకూడ లేదు. విఠలనామం తప్ప అన్యధ్యాస అనేదే లేకుండా పోయింది. అప్పుడప్పుడూ సావతమాళి ఎవరికీ చెప్పకుండా కూరలు గడపలోపెట్టి పోయేవాడు. చోఖామేళుడు ఎవరూ చూడకుండా నాలుగు కట్టెలమోపులు దొడ్లోవేసి పోయేవాడు. మాణకోజి బోధలబాబా ఎప్పుడూ రిక్తహస్తాలతో రాలేదు. గంపెడు జొన్నలు పదిరోజులకొక సారి తెచ్చేవాడు. ఎలాగో రెండుపూటలూ గడచిపోతున్నాయి. రాజాయి ఈ సంసారం నడపటం తనవల్లకాదని మొరపెడుతున్నది.

ఒకరోజు నామదేవుడి ఇంట్లో పొయ్యిలో పిల్లిలేవలేదు. రాజాయి ఇల్లంతా వెతికింది. గిన్నెలన్నీ దులిపింది. ఎక్కడైనా పిడికెడు గింజలు రాలతాయా అని. ఉదయమే కాకడారతికి వెళ్ళిన నామదేవ్ అటునించి అటే చోఖామేళుడి దగ్గరికి వెళ్ళాడు. రాజాయి ఏం చేయాలో పాలుపోక విచారంగా కూర్చుని ఉంది. ఇంతలో ఒక ఎడ్లబండి ఇంటిముందు ఆగింది. ధోండ్యా బండిలోనించే అడిగాడు. 'నామదేవ్‌గారి ఇల్లు ఇదేనా? అయన ఇంట్లో ఉన్నారా?' నామదేవ్ ఇంట్లో లేడని తెలిశాక బండిలో ఉన్న నాలుగు జొన్నల బస్తాలు దింపుకోండి నేను వెంటనే గోపాలపురం పోవాలి అన్నాడు. అవి ఎవరు పంపారు? అని అడిగితే వారెవరో తనకు తెలియదని ఈ బస్తాలను నామదేవ్‌గారి ఇంట్లో ఇవ్వమని చెప్పారని అన్నాడు.

రాజాయి ఒక చాటతో బస్తాలో జొన్నలు బైటకు తీసింది. అందులో బంగారు నాణాలు కూడ ఉన్నాయి. వాటిని ఏరి కొన్ని నారాయణకి ఇచ్చి వంటకి కావలసిన సరుకులూ, కూరలూ తెమ్మని చెప్పి పంపింది. కొన్ని నాణాలు డబ్బీలో దాచింది. అప్పుడే చంద్రభాగనుండి పిండిన బట్టలు బుజాన వేసుకొని వచ్చిన జని అది చూచి అశ్చర్యపోయి, ఆ పూటకు మాత్రమే సరిపడే జొన్నలు తీసుకోమని, బస్తాలు ఏమిచేయాలో నామదేవుడు వచ్చిన తరువాత చూద్దాం అని చెప్పింది.

నామ మధ్యాహ్నం తిరిగి వచ్చాడు. వస్తూనే బస్తాలు ఎప్పుడు వచ్చాయి? అని అడిగాడు. అవి సంతాజీబాబాగారి గుప్తదానం. ఆయన తనపేరు ఎప్పుడూ బయటపెట్టడు. క్రితంసారి ఆయన వచ్చినప్పుడు ఇక్కడి బీదల ఆకలి చూసి ఆయన ఇవి పంపాడు. వీటితోపాటు బంగారు నాణాలు కూడ ఉండాలే ఏవి? అని అడిగాడు. రాజాయి నోటితో అబద్దం చెప్పలేక, చెప్తే అవి కూడ ఎక్కడ బీదలకు పంచిపెడతాడో అనే భయంతో లేవు అని తల ఊపింది. నామ మరునాడు బీదలకు అన్నదానం విషయం చాటింపు వేయటానికి బయటకు వెళ్ళాడు. -సశేషం

# ఉదంక మేఘాలు

-శివ ప్రసాద్

(గత సంచిక తరువాయి)

ఉదం -ఛీ!ఛీ! నీవు చండాలుడవు. దుమ్ముకొట్టుకొన్న నీ ఒడలినుంచి స్రవించే ఆ చెమటను అమృతంలా నేను త్రాగాలా? నాకు ఇంకా కోపం తెప్పించక నీవు వెంటనే నా ముందు కనపడకుండా వెళ్ళిపో.

ఉదంకుడు అలా కోపంతో వెళ్ళగొట్టగానే ఆ చండాలుడు కుక్కలతో సహా అంతర్ధానం అయినాడు. అది చూడగానే ఉదంకుడకి వెరపు కలిగింది.

ఉదం - అయ్యో! అపచారం చేశానేమో! ఇది బహుశ శ్రీ కృష్ణుని ప్రసాదమై ఉంటుంది. తెలియక మోహంలో పడి అపచారం చేశానేమో!

ఉదంకుడు ఇలా అనుకుంటూ ఉండగానే అతడికి కృష్ణుడు తనవైపే రావటం కనిపించింది. కృష్ణుడు దగ్గరకు రాగానే

ఉదం - (కృష్ణునితో) స్వామీ! నిన్ను తలచుకుంటే ఇక్కడ జలం లభిస్తుందని వరమిచ్చావు. ఆ చండాలుడి దుమ్ముకొట్టుకున్న శరీరంనుండి కారుతున్న ఘర్మ జలాన్ని నేను ఎలా త్రాగేది? అదా నేను నిన్ను కోరిన, నీవు నాకు వరమిచ్చిన జలం. నీవు వరం ఇచ్చినట్లూ అయింది. అది నాకు పనికిరాకుండానూ అయింది.

కృష్ణ - (నిట్టూరుస్తూ) ఉదంకా! నీకు ఇంద్రునితో అమృతం ఇప్పిద్దామని చేసిన ప్రయత్నం అంతా బూడిదలో పోసిన పన్నీరు అయింది. నేను ఇంద్రుణ్ణి నీకు అమృతాన్ని ప్రసాదించమని అర్థించాను. ఇంద్రుడు, “కృష్ణా! మర్త్యులకు అమర్త్యత్వము ఎట్లా పొసగుతుంది? వేరే ఏదైనా కోరుకో ఇస్తాను” అన్నాడు. నేను కాదు కూడదు, నా వాక్కు వృథా కావటానికి వీలులేదు, ఏమైనా సరే నీవు ఆ మునీశ్వరుడికి అమృతాన్ని ఇవ్వాల్సిందే అన్నాను. ఇంద్రుడు మంచివాడు కనుక, నా మాట కాదనలేక, నాతో ఒక ఒప్పందం చేసికొన్నాడు. అతడు చండాలరూపంలో వచ్చి నీకు అమృతాన్ని ఇవ్వచూపేటట్లు, అయినా నీవు కుల గర్వంతో హ్రీదూషితుడవై దానిని తిరస్కరించి స్వీకరించకపోతే, అతడు దానిని తిరిగి తీసికొనిపోయేటట్లు, అప్పుడుజరిగిన దానికి తన తప్పేమీ ఉండదని, దానికి నేనే సాక్షిని అని. నీ వద్దకు చండాలరూపంలో వచ్చాడు. నీవు నిరాకరించగానే అతడు అమృతంతో అంతర్ధానం అయినాడు.సరే జరిగిపోయినదానికి ఇప్పుడిక విచారించి ఏమి చేయగలము? అయినా నేను

నీకు ఇచ్చిన వరం వృథా కాకుండా నీకు ఎప్పుడూ జలం లభించేలా చేస్తాను. ఓ పాపరహితుడా! నీవు ఎప్పుడు కోరితే అప్పుడు ఈ మరుభూమిలో మేఘాలు వర్షిస్తాయి. నీ కీర్తి దిగంతాలకు వ్యాపించేలా ఆ మేఘాలు ఉదంక మేఘాలు అనే పేరుతో పిలువబడుతూ ఇక్కడిక్కడే సంచరిస్తూ ఉంటాయి.

ఓ సువ్రతుడా! ఇక నేను వెళ్ళి వస్తాను. నాయందు నెపమెన్నకు. దయచేసి ఇకముందెన్నడూ నన్ను దూషించవని భావిస్తాను.

ఉదంకుడు సంతోషించాడు. శ్రీకృష్ణుడు కూడ అంతర్ధానమైనాడు,అని చెప్తూ వైశంపాయనుడు జనమేజయునితో ఓ మహారాజా! అద్భుతం కొలిపేలా ఆ ఉదంక మేఘాలు కొన్ని కొన్ని పుణ్యతిథులలో మరుభూమిలో ఇప్పటికీ వర్షిస్తూనే ఉన్నాయి అన్నాడు *

(శ్రీమదాంధ్ర మహాభారతము, అశ్వమేధపర్వము)

## శ్రద్ధాంజలి

కీ॥శే॥ కొండా ఈశ్వరరాజుగారి ధర్మపత్ని, కొండా నారాయణమ్మగారు ది. 3-6-2009నాడు గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 90సం.లు. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. వీరి కుమారులు శ్రీ కొండా రామరాజుగారు, వారి ధర్మపత్ని కాళీమాత ఆశ్రమంలో అనన్యమైన సేవ చేసుకుంటున్నారు. శ్రీ గురుదేవులు ఆ కుటుంబసభ్యులందరికీ ఆత్మశాంతిని ప్రసాదించెదరుగాక.

## బాష్పాంజలి

కీ॥శే॥ అమరా శ్రీశైలరావుగారి ధర్మపత్ని, ఆశ్రమ స్థిరవాసులు, అమరా కస్తూరిగారు ది. 6-6-2009నాడు గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 56 సం.లు. వీరికి ఒక కుమారుడు, నలుగురు కుమార్తెలు కలరు. శ్రీ గురుదేవులు వారికి ఆత్మశాంతిని ప్రసాదించెదరుగాక.

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**చాతుర్యైకనిధాన సీమ చపలాపాంగచ్ఛటా మన్దరం।**
**లావణ్యామృత వీచిలాలితదృశం లక్ష్మీ కటాక్షాదృతమ్।**
**కాళిన్దీపులినాంగణ ప్రణయినం కామావతారాంకురం।**
**బాలం నీలమమీ వయం మధురిమ స్వారాజ్యమారాధ్నుమః॥**

తెలిదామరరేకులవంటి కళ్ళుగల, నందబాలుని, కడగంటిచూపులు, నేర్పుకు నెలవైనవి. ఆ నేర్పు ఏలాటిది? విరాట్పురుషుడైనవాని నేత్రద్వయం సూర్యచంద్రులుకాగా, అవి జగత్తుకంతా వెలుగును ప్రసాదిస్తాయి. అట్టి కనుదోయిని కనుగొన్న యశోదమ్మ అనుభవం ఎలాటిదంటే.......

జగన్నాధుని ఆజ్ఞానుసారం, వసుదేవుడు గోకులంలోని నందుని యింటికి చేరి, వచ్చిన పని చూసుకుని గడపదాటగానే, అంతవరకూ మత్తులో ఉన్నయశోదమ్మకు మెలకువవచ్చింది. పురిటిల్లు అంతా గొప్పకాంతినిండి ఉండేసరికి ఆ వెలుగును చూడలేక ఆమె కళ్ళు తిరిగి మూతపడ్డాయి. అయితే ప్రక్కలో కదులుతున్న పసిబిడ్డ స్పర్శతో ఆమె గుండెలు పొంగి, కళ్ళు బాగా తెరిచి పసివాని ముఖంవంక చూసింది. విశ్వమూర్తి వదనంలో మెరిసే కనుదోయిని చూస్తూనే ఆ తల్లికి సూర్యచంద్రులు ఒకేసారి ఉదయించి నట్లనిపించి అది పగలో రాత్రో తెలియకుండా పోయింది. మాతను అంతగా మరిపించి మురిపించిన లీలాకిశోరుని చూపులలోని ఆ చతురత నెవరు వర్ణించగలరు?

ముఖకాంతికి తోడై, మిలమిల మెరిసే కనులలోని ప్రేమామృత తరంగాలతో లాలించే ఆ చూపులకి, పుండరీక హృదయుడైన శ్రీహరి గృహిణి అయిన సిరి కరిగిపోతూ, నాధుని కనుసైగలననుసరించి ఆదరంతో మెలగుతూ, స్వామి ఆజ్ఞానువర్తిని అయి ఉంటుంది.

ఇక బాలగోపాలదేవునికి యమునానది అంటే ఎంత అనురాగమనీ! దానికి కారణం ఉందిమరి. తన తండ్రి అయిన వసుదేవుడు తనను వ్రేపల్లెకు కొనిపోయేటప్పుడు, నాటి రాత్రి యమునానది తొలిసారిగా తన చిరుపాదాలను దర్శించి పులకించి, ఉవ్వెత్తునలేచే కెరటాలను అణచి తనకు దారినిచ్చిన పరమ భక్తురాలు అయినందుననే.

ఆపైన తీరానగల ఇసుకతిన్నెలు నందనందనునికి మరింత ప్రమోదం కలిగించే ప్రణయ నిధానాలు. ఎందువలన అంటారా! అక్కడే యశోదమ్మ ముద్దుల తనయుడు గోపాలురతో కూడి దాగుడు మూతలాడుతూ, చెట్లెక్కి కోతి కొమ్మచ్చులాడుతూ ఉంటాడు. పిల్లనగ్రోవిని ఊదుతూ సర్వ ప్రకృతిని మైమరపిస్తూ ఉంటాడు. గోవులను కాస్తూ 'పూర్ణచంద్రికా, సర్వమంగళా, మందాకినీ మహా హారిణీ, గౌతమీ గంగా' అని వాటిని ఆప్యాయంగా పిలుస్తూ తన ప్రేమనంతా వాటిపై కురిపిస్తుంటాడు. గోపబాలురతో చల్దులారగిస్తూ పెరుగన్నం ముద్దలతో వేళ్ళనడుమ ఇరికించిన, మాగాయ పచ్చడి పసందును రుచి చూపిస్తుంటాడు. గోవిందుడింత స్వేచ్ఛగా విహరించే, ఇంత పుణ్యానికి నోచుకున్న ఆ ఇసుకతిన్నెలు మహాభక్తులైన ధన్యాత్ములెందరో స్వామిపాద రేణువులై అక్కడ ప్రకాశించేందుకు ఆ రూపం దాల్చారేమో!

ఇంతేనా! అతగాడిని కామావతారాంకురం అనలేదా! కామమంటే కోరిక, ఇచ్ఛ. తనతో మసిలే గోపీరమణుల మాయనంటని మనస్సులలో మెదిలే కోర్కెలను, అవి జనించక ముందే తెలుసుకుని, వాటిని పుట్టించి, తీర్చి, జన్మ సార్థకతనందిస్తాడు. కనుక, స్వర్గసౌఖ్యాలను మించిన మధురాతి మధురమైన మహానందలహరులలో వారిని ఓలలాడిస్తాడు కూడాను. ఇందుకు రసిక చక్రవర్తి అయిన రమారమణుని రాసకేళీ వృత్తాంతమే నిదర్శనం. అటువంటి మన్మధ జనకుడు, నీలమణి వర్ణుడు అయిన వ్రజబాలుని మనం ఎప్పుడూ ఆరాధిస్తూ ఉందుముగాక! *

## అశ్రుకణం

ఆశ్రమవాసులు శ్రీ బాయిశెట్టి కేశవరావుగారు ది. 30-5-2009 గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 89సం.లు. వీరికి అయిదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలరు. శ్రీగురుదేవులు వారికి ఆత్మశాంతిని ప్రసాదించెదరుగాక.

# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

ధ్యానంలో సర్వం భగవన్మయమే అనే అనుభూతిని పొందాలి. దేహంకర్మ వల్ల వచ్చింది. కర్మ అజ్ఞానం వల్ల వచ్చింది. మనం ఆమహాత్ముల దయకు పాత్రులమయ్యాం. వారి సన్నిధికి చేరాం. అలాంటి మనకు సద్గురు పదం లభించటం, వారి మాటలు మనం గుర్తు చేసికోవటం అది వారి కృప వల్లనే. ఇప్పుడు మనం అనుకున్నాం. నీ వాక్కు వినాలి, నీ నీనామం చేయాలి. నా మనస్సు నీ రూపాన్ని దర్శించాలి. అప్పుడే ఈ జన్మకు సార్థకత అని. మన తలి దండ్రులు మనకు జన్మనివ్వటమే కాక మనకు గురుదేవులనుకూడా చూపించారు. లక్షలు లేకపోయినా లక్ష్యం బాబు అని చెప్పారు. ఏదో మిష చేత గురుదేవుని వద్దకు రావటం, వారి పరమానుగ్రహం పొందటం...

జీవితం ఉండగానే సత్యాన్ని గుర్తించి, అందులో రమత చెందటమే జీవన్ముక్త స్థితి. మన అమ్మ నాన్నలకు కారణం మన తాతలు. వారికి కారణం వారి తలి దండ్రులు. వారికి కారణం సృష్టి. సృష్టికి కారణం గురుదేవులు.

గురుదేవుల సన్నిధానంలో గురుబోధను శ్రద్ధగా శ్రవణం చేయటమేకాక, మాటి మాటికి వారిని వారి బోధను గుర్తు చేసికొన్న వ్యక్తి శ్రీ సంపత్‌గారు.ఆయనను గురుదేవులు 'సంపత్తి' అనేవారు.వారి సతీమణి రాధారాణిగారు. వారు అలా స్వామివారిచే కొనియాడబడిన దంపతులు. వారు విజయవాడలోసత్సంగం పెట్టారు. రాధారాణిగారు పొంగలి ప్రసాదం చేసి పెట్టారు. గురుదేవులు ఆ ప్రసాదాన్ని ఎంతో మెచ్చుకున్నారు. వారిది అద్దె ఇల్లు. అప్పుడు వర్షం వచ్చింది. అయితే ఏమి? కావల్సింది గురుకృప. స్వామివారు వదలలేదు. మేము వర్షం కురుస్తున్నా కదలలేదు. ఇప్పుడు చెప్పుకుని ఆనందిస్తున్నాం. ఎవరిమాటలు? వారి మాటలు.శ్రీ సంపత్ గారి భార్య రాధారాణిగారు కొంతకాలంగా అస్వస్థతగా ఉంటూ గురు సాయుజ్యం పొందిన కారణంగా మనం ఈరోజు శ్రీసద్గురుపాదపూజ చేసి కొంటున్నాము.

నిమగన్న కనులే కనులూ స్వామీ! నీవున్న తావులే బృందావనులూ।
(శ్రీమాతాజీ ఈ పాట పాడారు)

నిను స్మరియించుట - అమ్మయ్య మనకు ఆ చరణాలే కావాలి. ఈ పాట పాడుకుంటే ఎంత ఆనందంగా ఉంది? ఇదివారి సంకల్పమే.

అలాగ, ఆ అమ్మ అందరికీ మహా ప్రసాదం పెట్టేవారు. ఆ తరువాతే గురు ప్రసాదం. అమ్మకు కాత్యాయనీ... అనే పాట ఇష్టం. ఆ తరువాత సత్సంగం మొదలయ్యేది. ఫస్ట్‌లో ఆయన ఇంగ్లీషులో చెబితే శ్రీ వెంకటరత్నంగారు తెలుగులో చెప్పేవారు. స్వామివారు కనుమరుగయ్యాక వారు తెలుగులో చెప్తున్నారు. ఆఅమ్మ శ్రీబాబు అష్టోత్తరం నేర్చుకొని పారాయణ చేసేవారు. వారి అమ్మాయి పేరు సౌమ్య. సౌమ్యాయనమః అని శ్రీబాబు నామాలలో ఉంది.

శ్రీబాబును ఆశ్రయించి ఎంతమంది లబ్ధి పొందడం లేదు? నమ్మి చెడ్డవాళ్ళు లేరు. శ్రీ సంపత్‌గారు ఇప్పటికీ సమర్ధ సద్గురు (ఇంగ్లీషు)పత్రికకు గౌరవ సంపాదకులుగా తమ సేవలను అందిస్తున్నారు.

మనలను అనుగ్రహిస్తున్న ఆప్రభువును 'మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు' అని నిరంతరం స్మరించుకోవాలి. శ్రీగురుదేవుల కృపకు పాత్రులై ఆ అమ్మకు ఆత్మ శాంతిని గురుసాయుజ్యాన్ని ప్రసాదించాలని,త్వరలో వారి పుత్రికకు వివాహం సంపన్నం కావాలని ప్రార్థిస్తూ...

ఎవరో పెళ్ళి చూపులకు వచ్చారు. అందరూ ఈ అమ్మాయిని బ్యూటీ పార్లర్ (beauty parlour)కు వెళ్ళమంటే ఆ అమ్మాయి నాకు ఇష్టంలేదు అని స్పష్టంగా చెప్పింది. గురుదేవులకు ఏది ఇష్టమో ఆ పద్ధతిలో పెరిగింది. ఇప్పటి వాళ్ళలో కూడ ఇంతటి భావన కలిగిన వారిని ఇచ్చావా ప్రభూ! అని గురుదేవులకు నమస్కరించుకున్నాను.

బాబూజీ మహరాజ్ ధీరత్వంతో మనని చూస్తూనే ఉన్నారు.వారు కరుణాపూరితమైన ప్రసాదాన్ని 100% ఆస్వాదించే భాగ్యం కలిగి ఉండాలి.దానికి యోగ్యత ఏమిటి, అంటే నిరంతరం ఆధ్యాసలో ఉండాలి.అంతా వారి దయే. సుఖమూ నీ దయ, దుఃఖము నీ దయ - రెంటికి భేదం లేని అభేద దృష్టి కలిగి ఉండాలి. భగవద్గీతలో - **సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।** శత్రువులయందు, మిత్రులయందు సమభావన ఎవరికి ఉంటుంది? పసిపిల్లలలో ఉంటుంది. కాని తల్లి దండ్రులే వాడు మంచివాడు కాదు, వీడు నీకు శత్రువు అని నూరి పోస్తారు. దానితో

వాడిలో మార్పు వస్తుంది. పాలల్లో నిమ్మరసం వేస్తే ఆ పాలు విరిగినట్లు జీవితం నష్టమవుతుంది.

సీతామ్మవారి దర్శనానికి బయల్దేరిన ఆంజనేయ స్వామికి ఎన్ని విఘ్నాలు రాలేదు? కాని తానుగా బయల్దేరాడా? సీతమ్మను దర్శిస్తాను అన్న తరవాత వేరే భావన వచ్చిందా? నా రాముడే చేయించుకుంటాడు అని రాం, రాం అని ధ్యానంలో ఉన్నాడు. మరి మనం అలా ఉన్నామా?

జాంబవంతుని, అంగదుడిని, నీలుడిని అడిగారు. వారు తాము నూరు యోజనముల విస్తీర్ణం గల సముద్రాన్ని దాటలేమని చెప్పారు. సర్వ శక్తిమంతుడైన ఆంజనేయుడు ఒక మూల జపం చేసికొంటూ కూర్చున్నాడు. అందరూ వచ్చి - నువ్వయ్యా మహాశయా! నువ్వు దాటగలవు. సీత జాడ తెలుపగలవు అంటే- ఓహోచెయ్యగలనా? అనుకొన్నాడు. మనమో, అహం ముందు ఉండి తర్వాత మనం ఉంటాం. తప్పకుండా నా రాముడు నన్ను చేరుస్తాడు అని దృఢ సంకల్పంతో బయల్దేరాడు.

జై శ్రీ రాం అంటూ లంఘించాడు. అతని శరీరంలోని 33కోట్ల రోమాలు రాం, రాం అన్నాయి. మైనాకుడు సముద్రుని చేత ప్రేరేపింపబడి ముందు నిలిచి కొంచెం సేపు విశ్రాంతి తీసుకోమన్నాడు. పట్టుదలతో కార్యాన్ని సాధించటానికి వెళ్తున్నప్పుడు ఎటువంటి మొహమాటం ముందుకు రాకూడదు. కొంచెం అయినా లొంగాడా? 'మీరు చూపించిన ఆదరణకు నమస్కారం. కాలు మోపే సమయం లేదు. నేను రామకార్యార్థమై వెళ్తున్నాను. నాకు విశ్రాంతి తీసికొవటానికి అవకాశం లేదు.' అన్నాడు. ఈ ఒక్కటీ తీసుకొంటే చాలు. ఆచరణకి.ప్రభు కార్యంలో ఎంత అప్రమత్తత, శ్రద్ధ వహించాలో!

సరే! ఆంజనేయస్వామి వెళ్ళారు. మోక్షలక్ష్మిని దర్శించారు. ఆ వార్త రామునికి అందజేశారు.

మన అసలు స్వరూపం మోక్షమే.మనస్సు చేరి అది ఇంకొకటి అని ఎడం చేస్తోంది.

నువ్వు ఏ పాదాన్ని ఆశ్రయించావో ఆ పాదాన్ని గట్టిగా నమ్ము.ఆ పదాలను ఆచరించు. ఆ పదాన్ని పొందు - అని మహాత్ములు మనకి చెప్పారు. గురు సన్నిధానంలో మనకు స్థానం ఇచ్చారు. ఈ స్థానం మనకు సుస్థిరము. అకుంఠిత దీక్షతో సాధన చేసి గమ్యాన్ని చేరుకోవాలి. అటువంటి శక్తిని, భక్తిని, సాధనా సంపత్తిని శ్రీ సద్గురుదేవులు ప్రసాదించెదరు గాక! సుఖీభవ! సుఖీభవ!! *

# శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ సత్సంగ సమావేశములు

-నివేదిక

అంతవరకూ ఆ గురువుగారి దగ్గరే కేవలం ఆయన చుట్టూ తిరుగుతూ ఉండే శిష్యులు ఆ వచ్చిన మల్ల యోధుడి ఆకారాన్ని చూడగానే భయపడిపోతారు. అతడితో పోరాడటానికి వాళ్ళెవ్వరూ ముందుకురారు. కాని క్రొత్తగా శిష్యుడుగా చేరటానికి వచ్చిన ఆ యువకుడు మాత్రం నిర్భయంగా ఏ సందేహం లేకుండా ఆ మల్లవీరుడితో తలపడి, అవలీలగా చిత్తుచేస్తాడు. గురుఆజ్ఞాపాలన చేసినవారికి అలా గురుకృప కలుగుతుంది.

శిష్యులలో అందరూ నిజదాసులు కారు. కళ్యాణ్‌వంటి శిష్యులు అరుదుగా ఉంటారు. గురుదేవులు పెట్టే పరీక్షలో అటువంటి వారే నెగ్గుతారు. ఒకసారి సమర్థ రామదాసస్వామి గట్టిగింజలేవో, ఓటిగింజలేవో అందరికీ తెలియచేయాలి అనుకున్నారు. ఆయన శిష్యులు ప్రతిరోజు ఉదయం మొదట గురుదేవులకు నమస్కరించి తరువాతనే ఎవరి పనులకు వారు వెళ్ళేవారు. మర్నాడు ఉదయం శిష్యులు నమస్కరించటానికి వచ్చే సమయానికి సమర్థులు జుట్టువిరబోసుకొని, ముఖమంతా కుంకుమ పులుముకొని, భయంకరంగా కనిపిస్తూ అంతకంటే భయంకరంగా ఒక పెద్ద కత్తిని ఝళిపిస్తూ 'రండిరా! రండి. పెద్ద భక్తులు తయారయ్యారు. అడుగు ముందుకు వేస్తే చాలు ఒక్క దెబ్బతో వాడికి మోక్షం ఖాయం అంటూ వారిపైకి దూకారు. అందరూ భయంతో చెట్టుకొకరు, పుట్టకొకరుగా పారిపోయారు. సమర్థులు ఆ కళ్యాణ్‌గాడు ఎక్కడ? రొట్టెలన్నీ తెగతిని బాగా బలిసిపోయాడు. వాడు వస్తే ఒక్క దెబ్బతో వాడికి మోక్షం ప్రసాదిస్తాను. ఏడీవాడు? ఎక్కడ అంటూ గెంతుతూ లోయలో ఒక చెట్టుపైకి ఎగిరి కూర్చున్నారు. ఊరునుంచి తిరిగి వచ్చిన కళ్యాణ్‌కు మిగిలిన శిష్యులు గురువుగారికి దయ్యం పట్టిందని, కళ్యాణ్ ఎదురుగా వెళ్తే చంపేస్తాడని, వెళ్ళవద్దని జరిగిందంతా చెప్తారు. కళ్యాణ్ అంతా విని నిర్భయంగా నవ్వుకుంటూ గురుదేవులను వెతుక్కుంటూ కోట చివరకు వెళ్తాడు. సమర్థులు హఠాత్తుగా కత్తితో అక్కడ ప్రత్యక్షం అవుతారు. కళ్యాణ్‌తో భలేగా దొరికావు. వెనకకు అడుగువేస్తే లోయలో పడిపోతావు. ముందుకు అడుగువేస్తే ఈ కత్తితో ఒక్క దెబ్బకు నీకు మోక్షం ఖాయం. నీకు ఏం కావాలో కోరుకో అంటారు. కళ్యాణ్ అదే ఒక్క దెబ్బతో నా తల తెగి మీ పాదాలపైపడేలా

నరకండి. అదే నా కోరిక అంటాడు. సమర్థులు నక్కవినయాలు చూపిస్తున్నావా, నిన్ను అంత సులభంగా చావనిస్తానా? వారం రోజులు నిన్ను కత్తికొక కండగా నరికి చిత్రహింసలు పెట్టి చంపుతాను అంటారు. కళ్యాణ్ గట్టిగా గురుదేవుల కాళ్ళను తన హస్తాలతో బంధించి, అయితే ఇంకొక వారంరోజులు నాకు ఈ పాదాలకు సేవ చేసుకొనే భాగ్యం ప్రసాదిస్తున్నారు అన్నమాట. అంతకంటె ఇంక కోరదగినది ఏమున్నది? అంటాడు. సమర్థులు అత్యంత కరుణతో ప్రేమతో నా కళ్యాణ్ అంటూ అతడిని లేవనెత్తి హృదయానికి హత్తుకుంటారు. తరువాత కళ్యాణ్ నాకు పట్టిన దయ్యాన్ని వదిలించాడు అంటూ, కళ్యాణ్ చేయిపట్టుకొని అభంగాలు పాడుతూ వస్తారు. గురుదేవులు పెట్టే పరీక్షలు, అందులో నెగ్గిన వారిపైన వారి కృప అలా ఉంటాయి.

శివాజీ పుత్రుడు శివాజీ తరువాత రాజుగా వస్తాడు. కాని అతడు స్త్రీలోలుడు. శివాజీ పాలనకు, అతడి పాలనకు హస్తిమశకాంతారం. సమర్థులు అతనికి ఒక లేఖ వ్రాస్తారు. ఆ లేఖలో ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క కత్తిపోటులా అతని హృదయానికి తగులుతుంది. గురుపాదాలను హృదయంలో ప్రతిష్ఠించి జాగ్రత్తగా రక్షించుకోవాలని, అరిషడ్వర్గము, అసూయ, ఓర్వలేనితనం మొదలైన శత్రువులను సాధనతో శక్తిని పొంది మనలో ప్రవేశించకుండా చేసుకోవాలి అని ఆ ఉత్తరంలో సూచిస్తారు. గురుకృప అలా ఉంటుంది.

జనాబాయి నామదేవుణ్ణి సాక్షాత్తూ పాండురంగడుగా, తాను కేవలం ఆయన పాదదాసిగా భావించి, అటువంటి గాఢమైన విశ్వాసంతో నామస్మరణ చేస్తూ అనుసరించి ఉత్తమగతిని పొందింది. తను వ్రాసిన ప్రతి అభంగంలో, తన గురుదేవుని నామంతో పాటుగా, నామయాచిజని అని, జని నామయాచి అని, జనిలాడకి నామయాచి అని తన పేరుకూడ జోడించుకొని ధన్యజీవి అయింది. అమృతత్వాన్ని పొంది చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

అదే విధంగా గురుకృపను సంపూర్ణంగా పొందిన శ్రీ మాతాజీ కూడ శ్రీబాబునామంతో తమ పేరును కలుపుకొని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీ అయ్యారు. అట్టి అమ్మ ఆశీస్సులు మనందరిపై ఎల్లప్పుడూ వర్షించుగాక! *

# మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

(జూన్ నెల సత్సంగ కార్యక్రమంలో ది. 13.6.2009 రాత్రి 7గం. 10నిలకు శ్రీమాతాజీవారి బోధామృత సంక్షిప్త రూపం -ఎడిటర్)

తత్త్వాన్ని గురించి లోతైన విషయాలను శ్రీ వెంకచ రమణ ప్రసాద్ అందించారు. అదే లోతైన తత్త్వాన్ని తేలికగా ఆడుతూ పాడుతూ అందుకొనే విధంగా మనకు కామేశ్వరీ ప్రసాద అందించారు.

రాధతత్త్వాన్ని గుర్తిస్తే అదే కృష్ణుడైపోయింది. కృష్ణుడు ఎక్కడనుండి వచ్చాడు? కృష్ణ తత్త్వాన్ని జుర్తుకుంటే, ఆ కృష్ణనామమే ధారగా, రాధగా ప్రవహిస్తున్నది. అనుకోవటానికి రెండుగా అనుకుంటున్నా, ఉన్నది ఒక్కటే. ప్రపంచంలో కనిపించటానికి పురుషుడు, స్త్రీ అని రెండుగా కనిపించినా తత్త్వతః ఒక్కటే.

ఆత్మ తత్త్వాన్ని గుర్తించటం అంటే అనుభవం. తాను అనేది ఆత్మకు సంబంధించినది. ఆది కృష్ణ పరమాత్మ అయితే, దానిని ఆస్వాదించే మనస్సే రాధతత్త్వం. శ్రీ గురుదేవులు చెప్పినట్లు రాధ లేకపోతే కృష్ణుడు ఎక్కడ ఉన్నాడు? భక్తుడు లేకపోతే భగవంతుడు లేడు. ఆ ఏక తత్త్వాన్ని గుర్తించటానికి భక్తుడు ఉండాలి. అటువంటి భక్తి తత్త్వాన్ని మనకు ప్రతివిషయంలో అందించారు. గాఢమైన విశ్వాసమే, గాఢమైన నమ్మకమే భక్తి. శాస్త్రాలలోకి వెళ్తే, **సా భక్తి పరమ ప్రేమ స్వరూపా** అని నారద భక్తి సూత్రాలు చెపుతాయి. అది దేనికి సంబంధించినది? అది అంతఃకరణకు సంబంధించినది.

ఆకాశం అనంతమైనది. అందులో మనం ఎంత పట్టుకోగలం. గుప్పిట మూస్తే అందులో ఎంత పట్టితే అంత ఆకాశాన్ని మాత్రమే మనం పట్టుకోగలం. అయితే అది బాహ్యాపరమైనది. శరీరానికి సంబంధించిన ప్రేమలు తాత్కాలికమైనవి. అవి క్షణభంగురాలు.

పరమమైన ప్రేమ భక్తికి సంబంధించినది. భగవంతునియందు భగవన్నామమునందు కలిగే అనురక్తి మార్పులేనిది. గురుదేవులయందు ఉన్న ప్రేమ ఎటువంటిది? నీవు కేవలం బాహ్యామైన కోర్కెలు తీర్చుకోవటంకోసం వారిని ఆశ్రయిస్తున్నావు. అయితే ఏ సాధకుడు సర్వమూ ఆ గురుదేవునికి అర్పించి, సర్వమూ ఆ గురుదేవుడే అని గాఢంగా విశ్వసిస్తాడో అతడు ఆ

పరమానందాను భూతిలో ఓలలాడుతుంటాడు. నిరంతరము ఆ గురుదేవుల అమృత వాక్కులను ధారణ చేస్తుంటాడు. ఏది చేస్తున్నా, విషయసుఖానుభూతిని, ప్రపంచానుభూతిని కాక గురుదేవుల అనుభూతిని, పరమాత్మానుభూతిని అనుభవిస్తుంటాడు. ఆ అనుభూతి ఏ ఉపమానానికీ అందేదికాదు. దానికి కావలసిన సుగుణసంపత్తి ఏది అనేది శ్రీమద్భగవద్గీత 12వ అధ్యాయంలో అందించాడు. అంతకు పూర్వమే 11వ అధ్యాయం చివరలో గీతాచార్యుడు

**మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః।**
**నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ॥**

అని చెప్తాడు. నీవు ఏం చేసినా ఆ కర్మలన్నీ నా కోసమే చేయి. అందరిలోకీ నేనే శ్రేష్ఠుడనని నమ్ము. నాకే భక్తుడవై ఉండు. సంగవర్జితః అంటే ప్రాపంచిక విషయాలయందుగల సంగాన్ని విడచిపెట్టు. ప్రపంచం నీకు భిన్నంగా ఎందుకు కనిపిస్తున్నది? నీకు మానసిక రోగం ఉన్నది కనుక భిన్నంగా కనిపిస్తున్నది. మహాత్ముల పాదాలవద్ద పడి ఉండాలని ఎందుకు కోరుకుంటున్నాము? ఈ ప్రపంచం అనే రోగంలేని స్థితి ఆ పాదాల వద్దనే, సజ్జన సాంగత్యం వద్దనే లభిస్తుంది కనుక.

సంగవర్జితః అన్నప్పుడు సజ్జన సాంగత్యము, గురుదేవులతో సాంగత్యము వదలిపెట్టమని కాదు. అది అన్ని సంగాలనుండి విడిపించి నిస్సంగత్వానికి దారితీస్తుంది. సంగవర్జితః అన్నప్పుడు దుర్జన సాంగత్యం విడిచిపెట్టమని. ఇంకొకటి ఉన్నది అన్న భావం విడిచిపెట్టు. సర్వభూతములయందు శత్రుత్వం లేనివాడు ఎవడైతే ఉన్నాడో, వాడు నన్నే పొందుతున్నాడు అని పదకొండవ అధ్యాయం చివర ఈ ఒక్కమంత్రంలో భక్తియోగాన్ని అంతా రంగరించి పెట్టాడు భగవానుడు. నేనే అర్జునుణ్ణి అని కూడ చెప్పాడు పదవ అధ్యాయంలో. అంతా వినిపించిన తర్వాత భగవానుడు విశ్వరూపం చూపించాడు. చూచినది సాకారమైనది. విన్నది నిరాకారమైనది. అదంతా విన్న తరువాత మనకు వచ్చే అనుమానాన్నే అర్జునుడితో అడిగించి మనందరకు సమాధానం చెప్తున్నాడు.

**ఏవం సతతయుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే।**
**యేచాప్యక్షరమవ్యక్తం తేషాంకే యోగవిత్తమాః॥**

నిన్ను సాకారంగా, నిరాకారంగా సాధకులు ఉపాసిస్తారు కదా! సాకారమా, నిరాకారమా? ఏది శ్రేష్ఠం సాధకుడికి? అని అడిగాడు అర్జునుడు.

అప్పుడు తీరుబడిగా చక్కగా చెప్పాడు భగవంతుడు. ఇంతకుముందు మా గురుసోదరులు మనోజ్ అన్నయ్య చెప్పారుకదా; వానాకాలంలో కురిసే వర్షంలో ఉరుములు మెరుపులు ఉండవు, కుంభవృష్టే ఉంటుంది. అది సకాలవర్షం. వేసవి కాలంలో అన్నీ ఉరుములూ మెరుపులే. అంతా దుమ్ము, ధూళి ఎక్కువ ఉంటుంది. వర్షంమాత్రం కొద్దిగానే పడుతుంది. అది అకాలవర్షం. అర్జునుడు ఎప్పుడైతే తన సందేహాన్ని బయటపెట్టాడో అప్పుడు స్వామి సకాల వర్షంలాగా, సాధకుడికి ఉపయోగపడేలా బోధమొదలు పెట్టాడు.

మన మనసుకు ఊరట కలిగించే శాంతి కర్మలే కాకుండా గురుముఖతః ఏది వచ్చినా అదే మంత్రం. వారి ముఖస్థగా ప్రవహించేవన్నీ మంత్రాలై మనను మంత్రముగ్ధులను చేస్తాయి.

మరచినను మరపురారు మహానుభావులేమొ
గురువెంతో మంచివారు గురుతులెన్నో తెలిపినారు
అరమరయులేక నన్ను హరిచెంతకు చేర్చినారు ॥గురు॥
మూడు గుణమ్ములను మొదలంటా నరికినారు
మూటికిని సాక్షియైన ముక్తిని చూపించినారు
గురువెంతో మహామంచివారు గురుతులెన్నెన్నో తెలిపినారు॥గురు॥
షట్చక్రముల మధ్య సందులను తెలిపినారు
సందుగొందులు నిండి సాక్షాత్కరించినారు ॥గురు॥
ఎన్నెన్నో తెలిపినారు ఎవ్వరికీ సాటిరారు
మరచినను మరపురారు మహానుభావులేమొ ॥గురు॥

శ్రీగురుశ్శరణంమమ సద్గురు శ్శరణంమమ (ఈ నామాన్ని తాము మధురంగా చేస్తూ భక్తులతో కూడ చేయించారు.) వాస్తవానికి అర్జునుడికి విజయం యుద్ధం చేసిన తరువాత ప్రసాదించాడా? ముందే ప్రసాదించాడా? యుద్ధం చేయకముందే, విజయంనీదే అని అర్జునునికి విజయం ప్రసాదించిన తరువాతనే యుద్ధం జరిగింది. ఆశ్రయించన శిష్యుడిని గురుదేవులు నిర్మలాంతఃకరణ సిద్ధిరస్తు, ఆత్మజ్ఞానప్రాప్తిరస్తు అని దీవిస్తూ, గురుదేవులు నేను నీలోనే ఉన్నాను, నీవు నన్ను చూస్తే కదా! నీవు చూడలేక బాధపడుతున్నావు. నీవు చూస్తే నాకీ తిప్పలు ఎందుకు? అనటం నేను చాలసార్లు విన్నాను. వారికి తెలియని విషయం ఏమున్నది? పూర్వజన్మలనుండి వస్తున్న వాసనల వలన మనం వాటిలో పడి వెంపర్లాడుతూ కష్టాలను కొనితెచ్చుకుంటున్నాము.

-సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

(ఏప్రిల్17నుండి19 వరకు విజయవాడలోజరిగిన సత్సంగ కార్యక్రమాలలో 17వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

గురుదేవులు సూచించిన మార్గాన్ని అనుసరించిననాడు అంతా పర్‌ఫెక్ట్‌గా ఉంటుంది. కాని దానికిముందు శ్రవణ, మనన, నిదిధ్యాసలు కావాలి. మన వాక్కు మృదువుగా పవిత్రంగా అయ్యేలా సాధన చేయాలి.

స్వామి బోధ చేస్తుంటే ఎంతో మృదువుగా ఉండేది. అది మహాత్ములకే చెల్లు. అందుకే మనం మన నిత్యప్రార్థనలో, సత్యసుందర స్వరూపుడవైన ఓ పరమేశ్వరా! సత్యముగను, పవిత్రముగను, మృదువుగను ఉండు వాక్కును, నిర్మలమగు అంతఃకరణమును మాకు ప్రసాదింపుము అని ప్రార్థిస్తాము. వాక్కు సత్యముగా అయి మృదువుగా పవిత్రంగా ఉంటే అంతఃకరణం తప్పకుండా నిర్మలంగా అవుతుంది. వాక్కు పవిత్రంగా ఉంటే ఆ వాక్కుద్వారా మనస్సు, అంతఃకరణం పవిత్రమై, శబ్దం పవిత్రం అవుతుంది. శబ్దం ఆకాశగుణం కనుక, ఆ శబ్దం ద్వారా ఆకాశం పవిత్రత చెందుతుంది. పంచ భూతాలలో మిగిలిన నాలుగు భూతాలు ఆకాశంలో ఉన్నందువల్ల, ఆకాశంతో పాటు అవీ పవిత్రత చెందుతాయి. కర్త, కారయిత, ఉపద్రష్ట, అనుమంత అంటే చేసేవాడు, చేయించేవాడు, చూసేవాడు, అనుమతించేవాడు అందరూ మంచిచేసినా, చెడుచేసినా, అందరూ అందులో సమంగా భాగం పంచుకున్నట్లు, ఆకాశం పవిత్రమైతే, మిగతా భూతాలు కూడ పవిత్రం అవుతాయి.

సమయం ఉన్నది, కాని నీవు దానిని ఇది నా సమయం అని దానిని పూర్తిగా ఉపయోగించుకున్నప్పుడే ఫలం. సమయాన్ని కంట్రోల్ చేయటానికి ముందు బాహ్యవిషయాలను అంటే బయటనుండి వచ్చే అడ్డంకులను నిరోధించాలి. కాని నీవు ఎవరైనా తలుపు తడితే తలుపుతీసి మాట్లాడతావు. ఫోన్ వస్తే మధ్యలో ఫోన్‌లో మాట్లాడతావు.

భగవంతుడు చెప్తున్నాడు. నీవు ధ్యానంలో కూర్చున్నప్పుడు ఎవరైనా తలుపు తట్టితే తెరవకు. నీవు రాత్రి బాగా అలసిపోయి ఇంటికి వచ్చి

పడుకున్నావు. అప్పటిదాకా నిద్రలేని నీకు అప్పుడే నిద్ర వస్తున్నది. ఆ సమయంలో ఎవరైనా తలుపుతట్టితే తెరుస్తావా? తెరవవు. ఫోన్ వస్తే మాట్లాడవు. నిద్రలో మనస్సులేదు కనుక నిద్రలో ఇవేవీ ఉండవు. కానీ ధ్యానంలో మనస్సు ఉన్నది. ఆ మనస్సుతో నీవు స్వామివారి పాదాల మీద పుష్పం అవుతావో లోకంలో పడతావో నీ ఇష్టం. మామూలు పూవు అయితే మర్నాటికి వాడిపోతుంది. కాని మనోపుష్పం అలాకాదు. అది ఆత్మగా అయ్యేదాక వెళ్తుంది.

ఆ స్వామి దివ్య చరణారవిందాలు, ఆ అభయముద్ర, ఆ నేత్రదృష్టి భక్తులు అవి తమకే స్వంతం అనుకొనేలా ఉంటాయి. ఫోటోలో దృష్టి నిశ్చలంగా ఉంటుంది. అందుకని ఎవరు ఆ ఫోటోని చూస్తే ఆ ఫోటోలోని వ్యక్తి తమవైపు చూసినట్లు కనిపిస్తుంది. కాని స్వామి అలాకాదు. వారు సర్వులవైపు ఏకకాలంలో చూసేవారు. అందరికీ స్వామి తమవైపే ప్రత్యేకంగా చూసినట్లు అనిపించేది. మహాత్ముల దృష్టి అటువంటిది.

కొందరు భక్తులు గంపలు గంపలు గులాబీలతో పూజచేసేవారు. మనం అలా చెయ్యలేకపోవచ్చు. ఎందుకంటే దానికి బోలెడు డబ్బులు కావాలి. కాని దానిని చూసి మనం ఆనందిస్తే కూడ చాలు. మనం కూడ సమభాగినులమే. ఏం ఆ పువ్వులలో ఏ పువ్వుమనం కాదు. అటువంటి సద్భావన ద్వారా భవం లేకుండా చేసికోవచ్చు అని మహాత్ములు చెప్తున్నారు. భవము అంటే జనన మరణ ప్రవాహము. ఒక మహాత్ముడి పాదాన్ని ఆశ్రయించిన తర్వాత నీవు ఏ దేవుణ్ణి పూజించినా అక్కడ ఉన్న చైతన్యమే సర్వత్రా వ్యాపించి ఉన్నది అని తెలియ చేస్తారు. అంతేకాదు ఆ చైతన్యమే నీవు అని కూడ తెలియ చేస్తారు. అది మనకు శ్రవణం ద్వారా వస్తుంది.

ఒకాయన శ్రవణం అంటే ఏమిటండీ! ఎప్పుడూ శ్రవణం, శ్రవణం అంటారు అన్నాడు. గురుదేవులు తర్వాత నీకే తెలుస్తుందిలే అని అప్పటికి సమాధానం చెప్తారు. కాసేపయ్యాక గురుదేవులు అతడిని 'ఛీ దొంగవెధవా! చచ్చినోడా అంటూ తిట్టటం మొదలుపెట్టారు. అతడు గురువుగారిని కోపంతో ఏమిటండీ మీరు అలా అంటారు? అన్నాడు. గురువుగారు, మాటల ప్రభావం ఎలా ఉంటుందో ఇప్పుడు నీకు తెలిసింది కదా! కాని అది నీకు శ్రవణం వలననే కదా తెలిసింది అన్నారు.

శ్రవణం మంచిదే కాని ప్రపంచంనుండి వచ్చే దూషణ భూషణ తిరస్కారాలకు మనం స్థాణువులాగా, రాయిలాగా ఉండాలి. మనను ఎవరైనా ఏమన్నా అన్నప్పుడు లేదా దూషించినప్పుడు మనం 'కృష్ణార్పణం' అనుకుంటే మన మనస్సు పాడు కాకుండా ఉంటుంది.

వినికిడి వలన మనస్సు మంచితనంలో ఊరాలి. మనం తొలగించుకో వలసింది దేహదృష్టి, అంటే దేహమేనేను అన్న దృష్టి పూర్తిగా పోవాలి. ఆధ్యాత్మికతకు ఇది చాల అవసరం. దేహవాసన తొలగిన ఘన దివ్య దృష్టియే రామనామము.

గురుదేవులు అశరీరులుగా ఉన్నా, ఇప్పుడు కూడ వారి వాణి వినిపిస్తూనే ఉన్నది. కాని మనం దానిని ఎంత గుర్తిస్తున్నాము. గుర్తించనివారికి దుర్గతే.

ధ్యానంలో కొంతమంది బాగా లోపలికి వెళ్ళవచ్చు. కొందరు పైపైననే ఉండవచ్చు. అదంతా సాధనే. ఫౌండేషన్ గట్టిగా వేసుకుంటే ఇల్లు బాగుంటుంది. ఒకతడు ఇల్లు కట్టుకుందామనుకున్నాడు. ఎదురుగా అరటి చెట్లు కనిపిస్తే నరికి తెచ్చాడు. ఆ అరటిబోదెలు కూడ పచ్చగా ఆకర్షణీయంగా, బరువుగా ఉన్నాయి. అదంతా బలమే అనుకున్నాడు. తీరా ఇల్లు కట్టిన తరువాత ఆరటి బోదెలలో ఏముందో చూద్దామని వాటిని ఒలిస్తే ఏముంది? ఇల్లంతా కూలిపోయింది. అలాంటి తెలివి కాకూడదు. పైకి ఇల్లు లేవాలి అంటే క్రింద నుంచి సరిగ్గా రావాలి. పైన పదిలక్షల బిల్డింగ్ (Building) కావాలంటే క్రింద కనీసం ఒక లక్ష ఫౌండేషన్ కావాలి. అలాగే మన శరీరం బాగుపడాలి అంటే మన ఆచరణ, అంతఃకరణ, దృష్టి పవిత్రంగా ఉండాలి. స్వామి వీటినే చూసేవారు. వాటికే మార్కులు.

శ్రవణం చేసిన దానిని మననం చేసుకోవాలి. ఇన్ని గంటలు మనం ఎలా కూర్చోగలిగాము. అంతసేపూ సత్యవస్తువును గురించే మననం చేస్తున్నాము. కనుక ఇది మన సత్యకాలంలో జమ అవుతుంది.

మనం ఈ సంసారంలో ఉండక ఎలాగూ తప్పదు. అయితే బయటే కాదు, మన లోపల ఇంతకంటే బోలెడు సంసారం ఉన్నది. బయట ఏదైనా ఒకటి బాగుంది అనిపిస్తే చాలు వెంటనే మనస్సు సంకల్పిస్తుంది. చిత్తం ఊహిస్తుంది. బుద్ధి ఆలోచించి నిర్ణయిస్తుంది. అహంకారం క్రియ జరిపిస్తుంది. వీటి ద్వారా మన జీవితం నాశనం అవుతుంది. అలా కాకుండా ఉండాలి

అంటే అవి సత్యము, శాంతి, దయ, ప్రేమలుగా మారాలి. అవి అలా మారటానికి వివేక దృష్టి రావాలి. అంటే ఇందాక చెప్పుకున్నాము కదా నిత్యానిత్య దృష్టి, లేదా సత్యాసత్యదృష్టి, లేదా ఆత్మానాత్మ దృష్టి అని, అటువంటి దృష్టి రావాలి.

అటువంటి దృష్టి వస్తే అప్పుడు మనం ప్రపంచంలో ఉన్నా పరవాలేదు. మనం తప్పక ప్రేమించాలి కాని ఎంత వరకో అంతవరకే. అది మమకారం కాకూడదు.

ఈ అనిత్య ప్రపంచంలో నిత్యవస్తువు ఉన్నది. కాని మనం దానిని తెలిసికోవటం లేదు. ఇటువంటి ప్రశాంత వాతావరణం లభిస్తే కూడ నిద్ర పోతాము. బాగా ప్రశాంతంగా ఉంటే ముసుగు తన్ని నిద్ర పోతాము. కాకి కావు కావు అని అరిస్తే లేవటానికి బద్ధకిస్తాము.

కాని ఈ అనిత్య ప్రపంచంలో ఎన్ని పనులు? కానీ పనులన్నీ ఈ దేహం ఉన్నంత వరకే. ఈ జీవితం శాశ్వతం కాదు. ఇది ఎలాగూ పోయేదే. కాని ఇది ఉన్నప్పుడే మనం మనలో ఉన్న చైతన్యం యొక్క అనుభూతిని పొందాలి. దానిని గురించి నిత్యానిత్య వివేక దృష్టిని అలవరచుకోవాలి. అది అనుకొనేది కాదు. అనుభవించేది. దీనికోసమే మహాత్ములు తినటంకోసం బ్రతకటం కాదు, బ్రతకటంకోసం తినాలి అని చెప్పారు.

మనం విషయాలను అనుభవిస్తున్నామా? అవి మనను అనుభవిస్తున్నాయా? అది మనలను తినకపోతే మధుర పదార్థం ఎక్కువ తింటే రోగం ఎందుకు వస్తున్నది. అదే మనను అనుభవిస్తున్నది. అటువంటి వివేక దృష్టి కలిగి ధ్యానంలో కూర్చుంటే తప్పక ధ్యానం చక్కగా నిలుస్తుంది. *

## అశ్రుతర్పణం

ఆశ్రమనివాసులు శ్రీ అమరేశ్వరావుగారి ధర్మపత్ని రాజ్యలక్ష్మిగారు ది.19-6-2009 గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 65సం.లు. వీరికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు కలరు. శ్రీఅమరేశ్వరరావుగారు ఆశ్రమంలో సేవచేసుకుంటున్నారు. శ్రీగురుదేవులు వీరందరికీ ఆత్మశాంతిని ప్రసాదించెదరుగాక.

## శ్రీ బాబూజీ దివ్యవాణి

**ఇహం - పరం** శీర్షిక క్రింద ఆంధ్రప్రభలో వెలువడిన
శ్రీ బాబూజీ మహరాజ్ వారి దివ్య సందేశములు.

## సద్గురువు అంటే ఎవరు?

అమెరికా వంటి సంపన్న దేశాలలో ప్రభుత్వరంగ పరిశ్రమలలోను, వ్యాపారసంస్థలలోను పనిచేస్తున్న యువ అధికారులు ఇంకా ఉన్నతమైన పదవులకు అత్యాశలకుపోయి రోజుకు 20 గంటలు నిర్విరామంగా పని చేస్తూ ఉంటారు. ఈ శ్రమ ఫలితంగా వారు నరాల ఉద్రిక్తతకులోనై, హృద్రోగాలు, ఇంకా ఇతర రుగ్మతలను కొని తెచ్చుకుంటున్నారు. వారు తమ కుటుంబాలపట్ల బాధ్యతలను విస్మరించి సుఖ శాంతులను కోల్పోతున్నారు. చిట్టచివరకి దాంపత్య జీవితం ఛిన్నా భిన్నమై మానసిక శారీరక ఆరోగ్యాన్ని కోల్పోతున్నారు విద్యావంతులు, మేధావంతులు, విజ్ఞాన శాస్త్ర నిపుణులు ఐహిక సంపదలు, హోదా, విలాసజీవితంలో మునిగి తేలుతున్నప్పటికీ వారు పదవీ వ్యామోహం, ఆకాంక్షలమూలంగా మానసిక వైకల్యాల విషవలయంలో చిక్కుకుంటున్నారు. అటువంటివారికి మతం,ఆధ్యాత్మిక ప్రబోధాలు శాంతిని చేకూరుస్తాయి. ఆ అధికారులకు అటువంటి ఉన్నత పదవులను ఇచ్చిన భగవంతుని ప్రార్థన చేయటానికి వారు 24 గంటలలో గంటో, పది నిముషాలో లేదా కనీసం అయిదునిముషాలో వెచ్చిస్తే మంచిది. దయామయుడైన భగవానుడు తన అమృత కరస్పర్శతో వారిఅశాంతిని, మానసిక వైకల్యాలను ఇట్టే తొలగించగలడు. మతం బోధించే దివ్య సందేశం ఇదే.

మతం మనుష్యులకు నల్లమందు వంటిదని లెనిన్ వంటి రాజకీయ ప్రముఖులు అభిప్రాయం వెలిబుచ్చారు. ప్రపంచంలోని కోట్లాది ప్రజలకు సహనం, సంయమనం, సచ్ఛీలం, సత్యం, విశ్వాసం. ఆరాధన మున్నగునవి బోధించి, వారికి సుఖశాంతులు, సౌభాగ్యసంపదలు ప్రసాదించి వారిని దైవంవైపు నడుపగల ఏకైక సాధనం మతం అని అనడానికి చారిత్రిక సాక్ష్యాధారాలు ఉన్నాయి.

అన్ని మతాలలోకి పురాతనమైనది హిందూమతం. వేదాలు, ఉపనిషత్తులు, మహాకావ్యాలు, పురాణాలు అనంత జ్ఞాన భాండారాలు.

చెక్కు చెదరని విశ్వాసంతో హిందూమతాన్ని అనుసరించినంతకాలం భారతీయులకు అది అపారమైన ఐహిక, మానసిక, ఆధ్యాత్మిక సంపదను

అందించింది. వారి అభ్యున్నతికి దోహదం చేసింది. కాని ఆ మతం అవగాహన, అనుష్ఠానం ఇప్పుడు పరిమితం అయింది. ఇప్పుడు దేశం ఎదుర్కొంటున్న క్షుద్ర సమస్యలకు, ఆవేదనలకు ఇదే మూల కారణం. తన మతం నిర్దేశించినట్లు ఒక సామాన్య హిందువు రోజుకు మూడు సార్లు, లేదా, కనీసం ఒక్కసారైనా సంధ్యావందనం చేసుకోలేకపోతున్నాడు. వివాహ సమయంలో మంత్రాలేమిటో అర్థం చేసుకోకుండా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. ఆలయాలలో అర్చనలను గూర్చి తెలియకుండా వాటిని జరిపిస్తున్నారు. ఈ దురదృష్ట పరిస్థితికి రెండే కారణాలు. ఒకటి భాషాపరమైన ప్రతిబంధం మంత్రాలు, కావ్యాలు అన్నీ సంస్కృతభాషలో ఉన్నాయి. అంతకన్నా ముఖ్యమైన కారణం తగిన మత గురువులు మనకు లేకుండా పోవడం. మతానుష్ఠానికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలను మనకు బోధించే సద్గురువులు ఈనాడు సకృత్తు.

దేశంలో 50కోట్లమంది హిందువులకు ప్రయోజనం చేకూరాలంటే వారు తమ భాషలో మన కావ్యాలు, మత గ్రంథాలు చదవగలిగి ఉండాలి. అప్పుడే వారు మతంలోని మౌలిక సూత్రాలను అర్థం చేసుకుని అనుష్ఠించగలరు. క్రైస్తవులకు జీసస్ భగవంతుని దూత. మహమ్మదీయులకు మహమ్మద్ ప్రవక్త. అలాగే మన మతంలో ప్రవక్తలు, దూతలు, సద్గురువులు ఉన్నారు. ఈ యుగంలో బుద్ధుడు, ఆది శంకరులు, రామానుజులు, మధ్వాచార్యులు, గురునానక్, ఇటీవల కాలంలో శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, శ్రీఅరవిందులు, రమణ మహర్షి ప్రభృతులంతా సద్గురువులుగా భాసించి, ఆదర్శపురుషులైనారు. ఈ ప్రవక్తలు హిందూమతంలో నిక్షిప్తమైన మౌలిక సూత్రాలను స్పష్టంగా బోధించారు.

ఇటీవల కలకత్తాలో శ్రీ హనుమత్ కాళీ వర ప్రసాదబాబు ఆధ్యాత్మికప్రసంగం ఇస్తూ పై విషయాలు చెప్పారు.

ఎవరి సమక్షంలో ప్రజలందరికీ శాంతి, స్వస్థత చేకూరుతుందో, ఎవరి దివ్యప్రబోధం భగవంతునిలో అకుంఠిత విశ్వాసాన్ని ప్రదీప్తం చేస్తుందో, ప్రజలకు తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చడానికి ఎవరు ప్రోత్సహిస్తారో, ఎవరు ప్రజల మానసిక, దైహిక రుగ్మతలను పోగొట్టి, ఆధ్యాత్మిక పురోగతికి సరియైన ఆచరణయోగ్యమైన పథాన్ని నిర్దేశిస్తారో ఆయనే నిజమైన గురుదేవులు, లేదా సద్గురువు.

- సశేషం

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి)

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

ఆయన యందు అచంచల విశ్వాసం నిలిపి, ఆయన నిర్దేశించిన మార్గంలో సంశయ రహితుడై, స్థిర చిత్తుడై ముందుకు సాగవలసిన మానవుడు, గురువు యొక్క జన్మవిశేషాలను తెలుసుకోవాలని ఆరాట పడటంకన్న అవివేకం మరొకటిలేదు. సూర్యభగవానుడు ప్రసాదించే కాంతిలో అన్ని వస్తువులను దర్శిస్తూ, ఆయన లోని అనంత శక్తిని ఉపయోగించుకొని, ఎంతో లబ్ధిని పొంద వలసిన మానవుడు, ఆ సూర్యుని పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకోవాలని, సూర్యగ్రహంలోకి ప్రవేశించే ప్రయత్నం చేస్తే ఏమవుతుంది?

శ్రీబాబు సాధన కాలాన్ని గురించి, తెలిసినంతవరకు సవివరంగా "సాధనకాలము'' అనే అధ్యాయములో పొందుపరచటం జరిగినది.

తన సాధనకాలంలోను, అనంతరము కూడ, శ్రీబాబు పరిచయ, సేవా భాగ్యములను పొందిన భక్తులు దేశవ్యాప్తంగాను, విదేశాలలోను కూడ ఉన్నారు. శ్రీబాబు మొదటి సారిగా తమకు తాముగా ప్రత్యక్షంగా ప్రకటన అయిన కొన్ని సంఘటనలు"తొలి పరిచయాలు'' అనే శీర్షికలో వివరించటం జరిగింది. ఆ భక్తులందరి కుటుంబాలతోను అత్యంత సన్నిహితంగా, కుటుంబ సభ్యులలో ఒకరుగా ఎంతో చనువుగాఉంటూ, ప్రతిఒక్కరికి తల లోని నాలుకగా మసలుతూ,అందరిని మురిపిస్తూ, మరిపిస్తూ, కవ్విస్తూ , నవ్విస్తూ, పసిపిల్లల నుండి వయో వృద్ధుల వరకు అందరి హృదయాలను ఆకట్టుకొని అమృత తుల్యములుగా మార్చిన ఆత్మ స్వరూపులు శ్రీబాబు.



**శ్రీ బాబు**

**మన లోనుండే వెడలి వచ్చి**
**మన కోసమే, మన మధ్యనే అవతరించి**
**మన వలెనే, మనతోనే సంచరించి**
**మన మనస్సులలోనే ముద్ర ధరించి**

**మన లోని దానవత్వాన్ని సంహరించి**
**మన లోని మానవత్వాన్ని సంస్కరించి**
**మన లోని మాధవత్వాన్ని ఆవిష్కరించి**
**మనమే తానైపోయిన శ్రీ బాబు**

హిమాలయాలలోను, శ్రీశైలంలోను, పాపికొండలలోను, సుదీర్ఘతపశ్చర్యను కొనసాగించి, సత్య శోధనలో కృతకృత్యులైన శ్రీబాబు , పరమాత్మను తాము సగుణంగా దర్శించడమే గాక, నిర్గుణమైన ఆ పరమాత్మ తత్త్వముతో తమ అభిన్నత్వమును అనుభవించి, ఆ అనుభవస్థితిని కూడా దాటినదై, సగుణ నిర్గుణాతీతమై, రెండవది లేనిదై కేవలము తానే అయిన కైవల్య స్థితిలో శాశ్వతంగా నిలచిపోవాలని, హిమాలయ ప్రాంతంలోనే తమ అవతార కాలాన్ని గడిపి వేయాలని, అనుకున్నారు.

కాని తమ దేశ పర్యటన కాలంలో, ప్రజలలో విధి వంచితులై , అగ్ర వర్గాల దమన నీతికి, దౌర్జన్యానికి బలియై, నిస్సహాయులై ఆక్రోశిస్తున్న అసంఖ్యాకులైన నిమ్న జాతులవారు చేస్తున్న ఆక్రందనలు, పడుతున్న పడరాని పాట్లు, శ్రీబాబు దయార్ద్ర హృదయాన్ని తీవ్రంగా కలచి వేశాయి. అగ్ర జాతులమని చెప్పుకునే వారు ఈ నిమ్న జాతుల వారిని, అంటరాని వారుగా పరిగణించటం, హింసించటం, ఆకలితో, దారిద్ర్యంతో, అవిద్యతో అలమటించి పోతున్న ఆ నిర్భాగ్యులపై యిసుమంతైనా కనికరం చూపకపోవడం శ్రీబాబు సహించలేక పోయారు. స్వార్థపరులైన అగ్రజాతులవారు, విద్యను నిమ్నజాతులవారికి అందకుండా చేయటం, సేవకా వృత్తికే వారిని పరిమితం చేయటం, శ్రీబాబుకు దుర్భరమైన ఆవేదన కలిగించింది. సంస్కృతభాషను అభ్యసించడానికి వారు అనర్హులన్నారు, వేదం వినటానికి, కనీసం ప్రణవం ఉచ్చరించటానికైనా వారు పనికిరారన్నారు. చివరకు సర్వజీవరాసులకు తండ్రి అయిన పరమేశ్వరుని ఆలయంలో ప్రవేశించడానికి కూడా వారు అనర్హులని నిషేధించారు. అవ్యాజ, అపార ప్రేమస్వరూపిణి అయిన జగన్మాత తన సంతానంలో కొందరికి జరిగే యీ అన్యాయాన్ని సహించగలదా? సహించలేదు. కనుకనే జగన్మాత శ్రీబాబు రూపంలో మానవాళి మధ్య అవతరించింది. అస్పృశ్యతా భావాన్ని, అసమానతలను, భేద దృష్టిని తొలగించుకొని సర్వజీవులు సమభావముతోను, ప్రేమదృష్టితోను మెలగండని బోధించింది. సమసమాజ వ్యవస్థను నెలకొల్పింది. అదే తన అవతార కార్యమని నిశ్చయించుకొన్న శ్రీబాబు జీవ రక్షణ దీక్షా కంకణులై మానవకోటి మధ్యకు వచ్చి నిలిచారు.

-సశేషం



# శ్యామసుందరా! ఒక్కసారి!
# ఒక్కసారంటే ఒక్కసారి తిరిగి కనిపించవూ!

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

యాత్రలో పడిన అలసటను తీర్చుకోవటానికి ఉద్ధవుడు నదిలో దిగి అంజలిలో నీరు తీసుకొన్నాడు - ఉన్నట్టుండి అతని చేతులు వణికాయి, దోసిలి విడివడి నీరు ధారగా క్రిందికి ప్రవహించింది. క్షణం క్రితం చేతిలో ఉన్న నీరు ఇప్పుడు అనంత విశ్వంలో విలుప్తమయాయి... తిరిగి ఎవరైనా ఆ నీటిని పట్టుకోగలరా?... ఆ ప్రవాహం... ఈ జలం...

ఉద్ధవుడు తిరిగి క్రిందికి ఒంగాడు... అంజలి కలిపి పట్టి కాళిందిలో ముంచాడు - అంజలి తిరిగి రసప్లావితమయింది - అంజలిలో జలం -

ఈ జలాలలోనే కృష్ణుడు స్నానంచేసి ఉంటాడు -

ఈ జలాలతోనే కృష్ణుడు ఆచమనం చేసి ఉంటాడు -

ఈ జలాలలోనే కృష్ణుడు కాళీయదమనం చేసి ఉంటాడు -

ఈ జలం.. ఈ నీరు... ప్రవాహం...

అంజలిలో ఉద్ధవుడు నీరైతే తీసికొన్నాడు. కాని తిరిగి అంజలి విడివడి నీరు చేతిలోనించి జారిపోయింది. ఆ నీరు ప్రవాహంతో ఏకరూపమైంది. ఇంక దానిని ఎవ్వరూ తిరిగి వేరుచేయలేరు.

ఒక పక్షి అరుపు ఎక్కడినుంచో వినిపించింది...

ఇది కృష్ణుని మురళీ నాదమా? ఆ నాదం ఎక్కడ లుప్తమైంది? ఆ మురళీనాదం పక్షుల కంఠంలో నిలిచిపోయిందా? అంతే అయి ఉంటుంది...ఇంతకుముందు కాళిందీ తీరాన అంత తీయని పక్షుల స్వరం ఎప్పుడూ వినిపించలేదే!

కాళింది జలాలు అతని అంజలిలోంచి మాటి మాటికి ఎందుకు జారిపోతున్నాయి? కాళిందికి ఉద్ధవునిపై అలక రాలేదు కదా? ఉద్ధవుడు చేతులు జోడించి నతమస్తకుడై నిల్చున్నాడు. అప్పుడు కాళింది ప్రవాహంలోనించి ఏదో శబ్దం వినిపించింది...

"ఉద్ధవా! నీవు చాలా ఏళ్ళ క్రితం కృష్ణునితో ఇక్కడకు వచ్చావుకదా! గుర్తున్నదా! తరువాత మళ్ళీ కంసుడు చేసిన ధనుర్యాగానికి అక్రూరుడు బలరామకృష్ణులను తీసికొని ఇక్కడకు వచ్చినప్పుడు నీవుకూడా వారితో ఉన్నావు కదా! మరి ఈ రోజు... ఈ రోజు... నువ్వు ఇక్కడికి ఒక్కడివే వచ్చావేమిటి? కృష్ణ బలరాములేరీ? వారు ఎక్కడ ఆగిపోయారు? వారిని ఎటు పంపి నువ్వు ఇక్కడికి వచ్చావు ఉద్ధవా? చెప్పు... చెప్పు నాయనా?"

ఉద్ధవుడు వణికిపోయాడు... ఒక్కసారిగా తన చేతులు కాళింది నుండి బయటికి తీశాడు. కాళింది ప్రవాహం తనని ఏమిటి అడుగుతోంది? అతడు ఇప్పుడు కాళింది కళ్ళలోకి సూటిగా చూడలేకపోతున్నాడు... అతడు బాధతో కళ్ళు మూసుకున్నాడు... కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి...

"యమునా మాతా!" ఉద్ధవుని కళ్ళు మెల్లగా తెరుచుకొన్నాయి... పెదవులు వణికాయి. తల్లీ! నేను అపరాధిని! ఎవ్వరూ చేరలేని మాహాకాలుడి సదనం చేరిన కృష్ణుణ్ణి విడిచి ఇప్పుడు ఒక్కడినే వచ్చి ఈరోజు నీ జలాలలోఆచమనం చేయబోయాను. మాతా! నా అపరాధాన్ని నువ్వు క్షమిస్తావు కదూ? కాని... కాని... కృష్ణుడు నీతోనే... నీ వద్దనే ఉన్నాడు తల్లీ - ఇక్కడి ప్రతి పక్షి కూతలో నువ్వు కృష్ణుని మురళీనాదం వినలేదా? నీ జలాలలో ఈదులాడే తాబేళ్ళ గమనంలో నీకు కృష్ణుని పదధ్వనులు వినిపించటంలేదా? ఈ ఆవులు నీ జలాలలో స్నానంచేసి తడిసిన తమ శరీరాలను విదిలించు కుంటున్నప్పుడు అందులో నీకు కృష్ణుని స్పర్శ జ్ఞప్తికి రావటంలేదా? మరి... మరి... చూడు నా ఈ అశ్రు బిందువులు..." ఉద్ధవుడు ఇక మాట్లాడ లేకపోయాడు... ఒక ముత్యంలాంటి అశ్రు బిందువు అతని కనులలోనుంచి జారి యమున ప్రవాహంలో పడి లీనమైపోయింది.

ఉద్ధవుడు తిరిగి కనులు మూసుకొన్నాడు. కొంతసేపటి తరువాత ఇలా అన్నాడు, "మాతా!ఈ అశ్రుబిందువులో కృష్ణుడు ధరించే నెమలి పింఛాన్ని నీవు దర్శించటం లేదా? కృష్ణుడి శిరస్సులోని ఆ నెమలిపింఛాన్ని ఇప్పుడు నీవు నీ ఒడిలోనే దాచుకున్నావుకదా! నీ ఒడియే ఆ దేవకిమాత ఒడి, యశోదా మాత ఒడి. నీ ఈ వెచ్చనిఒడి, కృష్ణప్రేమతో నిండిన నెమలిపింఛం అనే ఈ అశ్రుబిందువు - ఈ రెండూ ఈ భూమిమీద ఆకాశంలో సూర్య చంద్రాదులు ఉన్నంతవరకు విరాజల్లుతూ ఉంటాయి!"

యమునానది లోతైన తన చల్లని జలాలో ఉద్దవుడికి ఎంతో ప్రేమతో సేదతీరేలా స్నానం చేయించింది.

మధురానగర దుర్గ ద్వారం దగ్గరకు చేరుకొనేటప్పటికి సాయంత్రం అయింది. నగరం బయటకు వెళ్ళిన గోధనం, గోపాలురు నగరానికి తిరిగివస్తున్నారు. ఉద్ధవుడు చూస్తున్న నగరం ఇప్పుడు కంసునిది కాదు. ఉగ్రసేనునిదీ కాదు. ఉగ్రసేనుడు కృష్ణునితోపాటే ద్వారకకు వెళ్ళిపోయాడు. జరాసంధ, కాలయవనుల బారినుండి వ్రజభూమి సదా రక్షింపబడాలని కృష్ణుడు మధురను విడిచి ద్వారకకు వెళ్ళాడు. అతనితోపాటే అనేకమంది యాదవులు ద్వారకకు వలస పోయారు. మిగిలిన యాదవులు, ఇక్కడ నివసిస్తున్నతరువాతి తరానికి చెందిన భోజ వంశస్థులు, కృష్ణుని గురించి విని ఉన్నారు అంతే - కృష్ణుని చూసినవారు, కృష్ణునితో ఉన్నవారు చాలా కొద్దిమంది ఉన్నారు - చాలా కొద్దిమంది మాత్రమే - ఎన్నో సంవత్సరాల తర్వాత ఉద్ధవుడు మధురకు వచ్చాడు. ఈరోజు రాత్రి మధురలో గడిపి మర్నాడు ఉదయాన్నే గోకులానికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు. గోకులానికి వెళ్ళి రాధను కలిసి కృష్ణుని సందేశం ఆమెకు అందించి తరువాత తాను కర్మ బంధనలనుంచి ముక్తుడవుతాడు...

దుర్గ ద్వారం వద్ద నుంచొని నూతన నగర విశేషాలను తిలకించాడు. ఒకరిద్దరు యువకులు అతని దగ్గరకు వచ్చి... ఒక అపరిచిత వ్యకిని చూసిట్లు చూశారు. "తాతా! ప్రణామాలు'' అంటూ ఒక వయస్కుడైన నగరవాసి వచ్చి అభివాదాలు అర్పించాడు. అయ్యా! మీరు ఈ నగరానికి కొత్తవారల్లే కనిపిస్తున్నారు. మీరు నిశ్చితంగా ఎక్కడికి వెళ్ళాలో నిశ్చయించుకోలేకపోతే మీరు నా అతిథిగా వచ్చి నా గృహాన్ని పావనం చేయండి!''

"వత్సా! నీకు కళ్యాణమగుగాక!'' ఉద్ధవుడు అతనిని ఆశీర్వదించాడు. కాని లోపల కొంత సంకోచంగానే ఉంది. ఉద్ధవునికికూడా ఈ నగరం తాను కొత్తదైంది... కొన్ని సంవత్సరాలలోనే ఎంతగా అన్నీ మారిపోయాయి! బహుశ కృష్ణుడే స్వయంగా వచ్చినా ఇచ్చటి నగరవాసులు ఇలాగే ప్రశ్నిస్తారు కదా -

అవును. అలాగే అవచ్చు... సరిగ్గా అలాగే అవుతుంది... ఈ ఆకాశం... ఈ భూమి... ఈ కాళింది... ఇవి అన్నీ అక్కడే ఉన్నప్పటికీ ఉద్ధవుడు ఇప్పుడు పరదేశి అయ్యాడు. మహాకాలుని గతిని ఎవరు తెలియగలరు!

"మధురానగరంలో ఎవరైనా వృద్ధ యాదవుని ఇంటికి వెళ్ళాలని ఉంది నాయనా!'' అన్నాడు ఉద్ధవుడు. మధురలోని వృద్ధుడైతే తనని గుర్తు పడతారు అనే ఆశాదీపం ఉద్ధవునిలో వెలిగింది. ''వృద్ధ యాదవుడా?' అన్నాడు ఆ ప్రశ్నించినవాడు ఆశ్చర్యంగా. "ఇక్కడ ఉన్న యాదవులందరిలో వృద్ధుడు అక్రూరుడు తాతా!'' అన్నాడు.

-సశేషం

---


Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,